


బ్రహ్మపుత్రానదీ ప్రాంతంలో, రెండువేల సంవత్సరాలక్రిందట, భల్లాణరాజ్యం చాలా ప్రసిద్ధికెక్కింది. ఆ రాజ్యానికి ప్రభువు ప్రమోదుడు. శూరుడుగా వీరుడుగా పరాక్రమవంతుడుగా ప్రమోదుడు పేరు పొందాడు. అతని పరిపాలనలో ప్రజ సుఖవంతులుగా ఉండేవాళ్లు.

అన్నివిధాలా సుఖవంతులైన ఆ ప్రజకు ఒక్కటే ఒక్క చింత పట్టుకున్నది. కారణం ఏమైతేనేమి, రాజు ఎన్నాళ్లకూ పెళ్ళిచేసికొనకపోవటమే. వాళ్ల చింతకు హేతువు.

రాజు భీష్మించుకు కూర్చున్నందుకు, ప్రజలు విచారిస్తూ ఊరుకోలేదు. పెద్దలు నలుగురూ సమావేశమై, చర్చలుచేసి, పది ఆమడ దూరంలో కొండమీద తపస్సుచేసుకొంటూవున్న ఒక మహాఋషివద్దకు వెళ్లి ఈ చిక్కు వెల్లడించారు. త్రికాలవేది ఐనటువంటి ఆ మహానుభావుడు వాళ్ళచేతికి ఒక ఫలం మంత్రించి యిచ్చి, 'ఇది మీ రాజు ఆరగించేటట్టు చేయండి, అంతా సుముఖమవుతుంది!' అని చెప్పిపంపాడు.

వాళ్ళు ఉత్సాహంతో మరలివచ్చి, రాజు ఫలాహారంచేసేటప్పుడు ఈ ఫలంకూడా కలిపియిచ్చారు. నాటిరాత్రి, అంతా మాటుమణిగినతరువాత, నిద్రిస్తూవున్న ప్రమోదుడికి వీనుల విందుగా ఒక మధురగానం వినిపించింది. ఇదేమిటా అని విస్తుపోతూ లేచాడు. ఎవళ్లకూ చెప్పకుండా తనొక్కడూ కోట దిగి, ఆ గానంవచ్చిన దిక్కుకి శ్రమపడి చేరుకున్నాడు.

చూడగా—అది ఒక రమణీయమైన ఆరామం. ఆరామంలో ఒక చక్కటికొలను.







ప్రమోదుడికి గంధర్వకన్యతో అతివైభవంగా వివాహంజరిగింది. ఇలా జరగటం రాజ్యంలో అందరకూ ఆనందాన్ని కలిగించింది. మరికొద్దికాలానికే వారికి ఒక కుమారుడు కలిగాడు. వానికి మహిపాలుడని నామకరణంచేసి, అల్లారుముద్దుగా పెంచుకొంటున్నారు. కాలమానం హాయిగానే సాగిపోతున్నది.

ఇలావుండగా—ఒకరోజున ప్రమోదుడు మామూలుప్రకారం వేటకు వెళ్లాడు. అనుకొన్నట్టుగా ఆనాడు జంతువులేవీ ఎంతసేపటికి దొరకలేదు.

అందుచేత, అడవుల లోపలికంటా వెతుక్కుంటూ వెళ్ళవలసివచ్చింది. మితితప్పిన నడకవల్ల రాజుకు బడలికకలిగింది. దప్పిక అయింది. దాహనికి ఆగలేక అటుయిటు చూచేసరికి అల్లంతదూరాన ఒక కుటీరం కనబడింది. అది అడవులను పాలించే కిరాతరాజు నివాసం. అందచందాలతో అమరివున్న ఆ చిన్నికుటీరంలో ఒక అందాలచిన్నదికూడా వున్నది. ఆమె కిరాతరాజు కుమార్తె, మందాకిని.

వయ్యారపు నడకలతో మంచినీళ్లు తెచ్చి అందిచ్చిన ఆ ఒప్పులకుప్పను చూడగానే రాజుకు ఆమెపైన మనసు పోయింది. ఇలా

కొలను ఒడ్డున కూర్చుని, పదిమంది పరిచారికలమధ్యనున్న ఒక గంధర్వకన్య వీణ వాయిస్తున్నది!

అంతవరకు పెళ్ళివిషయంలో అలక్ష్యం చూపిన ప్రమోదుణ్ణి. ఆనాడు మొట్టమొదట కంటబడిన ఆ గంధర్వకన్య ఎంతగానో ఆకర్షించింది! ఆకర్షించడమేమిటి? ఆమెను తప్ప మరొకతెను పెళ్ళాడనని పట్టుబట్టాడు. ఇదే ఆ ఋషి అనుగ్రహించిన ఫలానికి ఫలితం కాబోలునని అందరకూ అవగాహనయింది—అనగా, ఆఫలం ఆరగించిన తరవాత తొలుతగా ఏకన్యను చూస్తే, ఆమెపైన మనసుపోతుందని. ఈవిధంగా ఆ మహనుభావుని కృపవల్ల,









మెచ్చి కోరుకున్న ప్రమోదుడు ఆమెను గాంధర్వవిధిగా చేపట్టి, తనవెంట కోటకు తీసుకుపోయాడు.

మందాకిని మంచిరాణి అని రాజ్యంలో వాడుకపడింది. మనిషికి గుణం ప్రధానం కాని కులంకాదని ప్రజలు సంతృప్తి చెందారు. ప్రజల సంతృప్తివల్ల ప్రమోదుని రాజ్యపాలన చాపకింది నీటిలాగ ఒడుదొడుకులు లేకుండా సాగిపోతున్నది.

మరికొద్దికాలానికే అదృష్టవశాన చిన్నరాణి మందాకినికికూడ ఒక పుత్రుడు కలిగాడు. పుత్రుడు కలగటంతో, ఇంతవరకు మాయా మర్మములేక మసులుతూ వచ్చిన మందాకిని మతమే మారిపోయింది. అటువంటప్పుడు, ఆమెవల్ల గంధర్వకాంత నిరాదరణ పొందినదన్నా, ఆమెచేతులలో మహిపాలుడు చెప్పరానిపాట్లు పడుతున్నాడన్నా ఆశ్చర్యం దేనికి ?

మందాకినిలో కలిగిన మార్పు ఇలా వుండగా, కలలోనైనా తలపలేని మరొక చిత్రమైన మార్పు వచ్చింది. అదేమిటి అంటే, గంధర్వకాంత ఇలాయోచించింది.

'కోరితెచ్చుకున్న చిన్నరాణి హయాము చెలాయిస్తున్న దిప్పుడు. ఆమె యిష్టానికి రాజు ఎంతమాత్రమూ ఎదురుచెప్పలేదు. మాటకువిలువలేనప్పుడు బలవంతాన ఇక్కడ ఉండి నేనెందుకు బాధపడాలె? నావల్ల ఇతరులకు ఎందుకు బాధకలిగించాలె?— పోతే—ఎవరు ఏమన్నప్పటికీ, పట్టంకట్టుకోవలసినవాడు పసివాడు మహిపాలుడు. ఈ సంగతి రాజుకు తెలియదా, రాజ్యంలోని ప్రజకు తెలియదా?—కానీ, ఏదెలా కానున్నదో చూదాం' అనే వూహతో గంధర్వకాంత ఒకనాటిరాత్రి పిట్టకైనా తెలియకుండా అదృశ్యమైపోయింది.

సవతి ఇలా అదృశ్యంకావటం మందాకినికి సంతోషమే కలుగచేసింది. ఏమి! ఆమె ఎచటలేదుగనక యిష్టంవచ్చినట్లల్లా పిల్లవాడిని యాతనలుపెట్టి కసితీర్చుకో








వచ్చు. తన కోరికలన్నీ నెరవేర్చటానికి, దుంతగాలకూ దుశ్చేష్టలకూ తోడుపడటానికి తండ్రియైన కిరాతరాజు సాయంగానే వుంటున్నాడు.

ఇప్పుడు ముఖ్యంగా, తన ముద్దుబిడ్డడైన అర్ధకర్ముడికి పట్టంకట్టించాలెననే పట్టుదల ఆమెమనసులో వృద్ధిపొందుతూవచ్చింది. ఆమెకు ఈ కాంక్ష వృద్ధియైనకొద్దీ సవతి బిడ్డపట్ల కాఠిన్యం ఎక్కువకాసాగింది.

కొడుకుమీది మక్కువ ఎంతగా ఎక్కువయిందంటే—సవతిబిడ్డడిని హతమారిస్తే కాని తనకుమారుడు గద్దెఎక్కటానికి వీలు పడదనే నిశ్చయానికి వచ్చింది. ఎటువంటి దారుణానికి ఒడికట్టటానికైనా ఆమెమనసు వెనుకాడలేదు. ఎప్పుడైతే ఈ విషబీజాలు ఆమెహృదయంలో పడినయో, ఆ క్షణం నుంచీ అవి మొలకెత్తి పెరుగుతూనే వున్నయి. రాత్రింబవళ్లు తిండీ నిద్రా లేకుండా, మందాకిని ఈ సమస్యను గురించే తీవ్రంగా ఆలోచన చేస్తున్నది. ఈ కోరిక ఫలించటంకోసమే ముక్కోటి దేవతలకూ మొక్కుకున్నది. ఆమె ఆలోచనలు ఫలించేటందుకు తగిన అనుకూలపరిస్థితులుకూడా అమరటానికి ఎంతో కాలం పట్టలేదు.

•   •   •

ఉన్నట్టుండి భల్లాణరాజ్యంలో ఒక చిత్రమైన వదంతి వ్యాపించింది—'గంధర్వులు దేవగణానికి చెందినవాళ్ళు. దేవతలను మానవులు వివాహంచేసుకోవటమనేది కేవలమూ విడ్డూరమూ, శాస్త్రవిరుద్ధమున్నూ. ప్రమోదుడు, కనీవినీ ఎరుగని ఇటువంటి పని చేయటానికి సాహసించాడు. తీరికూర్చుని గంధర్వకాంతను పెండ్లాడినాడాయె! పైగా, ఆమెవల్ల కుమారుణ్ని కూడా కన్నాడాయె!! ఈ పరిస్థితుల్లో దేవతల కోపకారణం వేరే వెతకాలెనా? ఇక్కడికి రెండేళ్లనుండి వర్షాలు ఎత్తికట్టటానికీ, పంటలు నాశంకావటానికి ఇదే



కారణం' అంటూ ఈవిధంగా దేశమంతటా వదంతి మోగిపోతున్నది.

అనేటా అనేటా పాకి, ఈమాటలు రాజు చెవిని పడగానే ప్రమోదుడు కలవరపడ్డాడు. 'ఇది నా పొరపాటు కాదే. లోకక్షేమం కోరి ఒక ఋషి చేసిన పని. ఆయన ప్రోద్బలమే లేకుంటే నేను బ్రహ్మచారిగానే ఉండిపో దునే. ఆ మహానుభావుని దీవనకు విరుద్ధంగా ఇప్పుడీ పుకారు ఎందుకు పుట్టింది? ఈ వివాహంవల్లనే ఇటువంటి అరిష్టం కలుగుతుండంటే ఆయన నన్నెందుకు ప్రోత్సహిస్తారు?' అంటూ తనలో తను తర్కించుకుని తత్తరపడసాగాడు.

తత్తరపడ్డాడే కాని, రాజు ఒక తీర్మానానికి రాలేకపోయాడు. ఇటువంటి సమస్యలను పరిష్కరించటానికి, ఇదమిద్ధమని తేల్చటానికి సమర్థులు పూర్వంనించీ, రాజగురువులైన పురోహితులే.

కనుక, తక్షణమే రాజు ఆస్థాన పురోహితుణ్ణి పిలిపించాడు. మనసులోకలిగినటువంటి బాధ వెల్లడించి, గత్యంతరమేమిటని ప్రశ్నించాడు.

పురోహితుడుకూడా ఈ వివాహం శాస్త్ర విరుద్ధమేనని నిష్కర్షగా చెప్పాడు. ఐతే- మరి దీనికి పరిహారమేమిటి? అనే ప్రశ్న వచ్చేసరికి కళవెళపడ్డాడు. ఏమీ?—ఒక వంక, అమాయకుడైన పసివాడు మహీపాలుడు కళ్లవెలుగుగా కనిపిస్తున్నాడు! మరొకవంక భీకరస్వరూపం దాల్చి రాణి మందాకిని కఠోరస్వరంతో హుంకరిస్తున్న దృశ్యం కనిపిస్తున్నది!! ఈ యిరువురి మధ్యని పడి నలుగుతున్న తననే యిప్పుడు రాజు ప్రశ్నిస్తూవుంట!!!

ఇన్నింటికితోడు, రాజుపక్కనే కూర్చుని వున్న రాణి, తన కంఠంమీద చెయ్యివేసి చూపి, సంజ్ఞచేయటంకూడా పురోహితుడు స్పష్టంగా గమనించాడు. రాజు వేసిన ప్రశ్నకు ఏదోవక జవాబు చెప్పితీరాలికదా! రాణి వుద్దేశం తెలియనే తెలిసింది. ఆమెకు







ఎదురెత్తుగా వెళ్లేశామంటే తనకు నూరేళ్ళూ నిండినట్టే! అందుచేత, ఈ క్లిష్టసమయంలో 'మనం చేసేది పాపమా, పుణ్యమా?' అని యోచనచేయటానికే వ్యవధి లేకపోయింది.

'ప్రభూ!— దేవర శాసించారు కనక చెప్పకతప్పదు. దేశానికి పట్టిన అరిష్టం తొలగిపోవాలంటే, దేవగణానికి చెందినట్టి, గంధర్వకాంతకు పుట్టినట్టి, బిడ్డను దేవలోకానికి పంపించివేయాలని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి' అని అంటూ, చెప్పలేక చెప్పలేక మనవిచేశాడు.

రాజు ఆత్రంతో 'ఏమిటి! ఏమిటి!! మళ్ళీ చెప్పండి. నాకు అర్థంకాలేదు' అని పురోహితుణ్ణి వేగిర పెట్టాడు.

అందుకు ఆయన 'మహారాజా!—మన మహిపాలుణ్ణి దేవలోకానికి పంపించివేస్తే రాజ్యం మళ్ళీ సుభిక్షంగా వుంటుందని, పసివానికి పుణ్యగతులు కల్పించాలంటే యథావిధిగా బలిచేయాలని పండితులంటున్నారు. ఎంతట ఈపని జరుగుతుందా, ఎంతట దేశం బాగుపడుతుందా అని ప్రజలు యెదురుతెన్నులు చూస్తూవున్నారు ప్రభూ!' అని చెప్పాడు, వినయంగా.

దుర్భరమైన ఈమాట వింటూనే రాజు, కూర్చున్నవాడు కూర్చున్నట్టుగా సింహాసనంమీదనే సొరిపోయాడు. ఆయనకు వంటిమీద చైతన్యం ఏమీలేదు. ఏతండ్రి భరించగలడు ఇటువంటి పరిస్థితి! రాణి మందాకిని పట్టరాని దుఃఖంలో మునిగిపోయింది! కొంతసేపు ఉపచారాలు చేసినతరువాత ప్రమోదుడు తేరుకొన్నాడు.

లోకంలో బయల్దేరిన ఈ వదంతి ఆయనను హృదయశల్యంగా వేధింపబొచ్చింది. మనసు ఎంతగా వికలమై పోయినప్పటికీ, తొందరపడక నిదానంగా యోచించాడు. ఇంతమంది పండితులూ, లక్షలాది ప్రజలూ అవునంటున్నది తను కాదనటం ఎట్లా? పుత్రప్రేమ ఎంతగా వున్నప్పటికీ, జనవాక్యానికి యెదురీదటం ఎవరికశక్యం?





నిస్పృహయుడైన ప్రమోదుడు కూలబడ్డాడు. రాజ్యంలో ప్రజల హాహాకారాలు యెక్కువయినై. ఇక వారు భరించలేకపోయారు. 'మహీపాలుణ్ణి బలిపెట్టవలసిందే!' అనేమాట మారుమోగిపోసాగింది. ప్రజల బాధలు చూచి రాజు సహించలేక, బలికి సమ్మతించాడు.

మహీపాలుణ్ణి బలిచేయటానికి ఏర్పాటులన్నీ పూర్తిచేశారు పురోహితులు. అదే భద్రకాళీ ఆలయం. ఆలయం యెదుట ఇదే బలిపీఠం. సుముహూర్తం పెట్టినరోజు వచ్చింది. పెద్దలందరూ సమావేశమయారు. అక్కడ విరగబడిన అశేషజనం ఇసుకవేస్తే రాలటం లేదు. అంతా నిశ్శబ్దం!

అక్కడ రాజసౌధంలో—తోడిపిల్లలతో ఆటపాటలలో మునిగివున్నాడు పసివాడు మహీపాలుడు. వానిని చక్కా అలంకరించారు. బాజాభజంత్రీలతో ఊరేగించి, నగరు చివరనున్న కాళికా ఆలయానికి తీసుకవచ్చారు. గుడిలో వేదికపైన కూర్చోపెట్టి మంత్రఘోషలు జరిపిస్తున్నారు. ఈ సందడి అంతా దేనికో అమాయకుడైన ఆ బిడ్డడికి తెలియనే తెలియదు, పాపం!



అంతలో ప్రమోదుడు పిచ్చిపట్టినవానిలాగా కోటదిగి పరుగులెత్తుకొంటూ వచ్చాడు గుడికి. తిప్పి కూర్చునివున్న పెద్దలవంక, సభాసదులవంకా తిరిగి, "అయ్యా!—నా వివాహం శాస్త్రవిరుద్ధమన్నారు. ఇది దేవగణాలకు ద్రోహమన్నారు. దేవతలు కోపించి, ఈ దేశారిష్టం కల్పించారంటున్నారు మీరు. కాదనను నేను. ఇందుకు పరిహారంగా బిడ్డడిని బలి యివ్వటానికికూడా అటంకపెట్టను. కాని...నాది ఒక చిన్నకోరికవున్నది...అదిమాత్రం నెరవేర్చండి" అన్నాడు, దీనంగా.

'ఏమిటది?' అని ప్రశ్నిస్తున్నట్టుగా అందరూ ఒక్కసారి రాజువైపు తిరిగారు.

ప్రమోదుడు తుదిసారి బాలుణ్ణి చేరదీసుకొన్నాడు. సభవంక తిరిగి, 'పరిస్థితులు





ఇలా వక్రమార్గం పట్టిఉండకపోతే, ఈ చిన్నారి మహిపాలుడు పట్టంకట్టుకోవలసిన వాడేకద! ఐతే, ఇప్పుడు కథ అడ్డం తిరిగింది. విధివిలాసానికి ఎవళ్ళయినా తల ఒగ్గవలసిందే. నా బాబు పట్టాభిషిక్తుడైతే ఎలా వుండేవాడో, ఒక్కసారి నన్ను కళ్ళారా చూడనివ్వండి. ఇదే నే కోరేది' అంటూ జాలిగా చెప్పాడు. జనమంతటికీ అప్రయత్నంగా బొటబొటమని కన్నీళ్ళు రాలినై!

ఈ మాట రాణికి మనస్కరించినట్టు లేదు. విసవిసలాడింది. ఏమేమో సంజ్ఞలు చేసింది. కాని యెవరూ లక్ష్యపెట్టలేదు.

అప్పుడు పురోహితులపెద్ద లేచి, 'ప్రజల ఘోషచూచి ఏ ప్రభువు సహించగలడు? జనవాక్యం ఆలించి మన ప్రభువులు పిల్లవాడి బలికి అంగీకరించే వున్నారు. ఇక, గడియో క్షణమో పసివాడి జీవుడు పోనే పోతుంవాయె. రాజంతటివాడు స్వయంగా వచ్చి కోరుతున్నప్పుడు కాదనటం మూర్ఖత అనిపించుకుంటుంది. బాలుడికి ఒక్కసారి కిరీటం ధరింపించి, ప్రభువు ముచ్చట తీర్చండయ్యా!' అన్నాడు.

అక్కడవున్న సమస్తజనులూ 'పెట్టండి, బాబుకు కిరీటం పెట్టండి. ఒక్కమాటు కళ్ళవేడుకగా చూస్తాం!!' అని ఆవేశంతో కేకలువేయసాగారు.

తక్షణమే దేవిడినుంచి తళతళ మెరిసే రత్నకిరీటం తెప్పించారు. యథోచితంగా మహిపాలుడి శిరస్సున వుంచారు. పూలమాలలు వేశారు. కోలాహలం చెలరేగుతూ వుండగా, పసివానిని గుడిచుట్టూ ముమ్మారు ప్రదక్షిణం చేయించి, బలిపీఠంముందు నిలబెట్టారు.

మంత్రఘోషలమధ్య పురోహితుడు 'జై శంకరీ! జై భవానీ!!' అంటూ కత్తి ఎత్తాడు. ఆ లకలాది ప్రజల నేత్రాలు అన్నీ పసివానిపైనే నిలిచిఉన్నయి.

ఆ క్షణంలో— [ఇంకా వుంది]








## 2

ఆ క్షణంలో—'ఆగు, ఆగు! మహిపాలుని తలపైన వున్న రత్నకిరీటం తీయాలి' అంటూ కేకవేశాడు, కిరాతరాజు. అందరూ నిశ్చేష్టులయ్యారు. అందరితోపాటు దుఃఖ సాగరంలో మునిగివున్న ప్రమోదుడూ విస్తుపోయాడు.

వెంటనే పురోహితుడు, ఎత్తిన కత్తిని కింద వుంచి, మహిపాలుని తలపైనున్న రత్నకిరీటం తీవామని రెండు చేతులా దాచాడు.

అప్పుడు గుండె దద్దరిల్లేటట్టు 'నాయనా! నన్ను బలివేయుటం?' అంటూ మానవ భాషలో గొప్ప శబ్దం వినిపించింది.

నలుదిశలా కలయచూచారు జనం.

అంతలోనే, జనసమూహం కంగారుగా చెల్లాచెదురు కావొచ్చింది. 'హంస! హంస!! బంగారు హంస!!!' అని అందరూ ఒక్కసారిగా ఎలుగెత్తి అరిచారు. దానిని చూసి వారు స్తంభించిపోయారు.

అది చిత్రవిచిత్రమైన వన్నెలచిన్నెల రాజహంస! బంగారు రాజహంస!! ఇందాక వినబడిన పలుకులు ఈ రాజహంస పలికినవేనని, దాని కంఠస్వరం పెద్దరాణి దన గంధర్వకాంత కంఠస్వరమేనని పిల్లవాళ్ళకుకూడా తెలిసిపోయింది. అయితే- అది ఎలా అక్కడికి వచ్చిందోమాత్రం ఎవరూ కనిపెట్టలేకపోయారు.

మహిపాలుడు 'అమ్మా! అమ్మా!!' అనుకొంటూ పోయి, గట్టిగా ఆ హంస మెడను చుట్టేసుకొన్నాడు. వెంటనే రత్నకిరీటధారి దన మహిపాలుణ్ణి వీపుపైన ఎక్కించుకొని, అది ఎగిరి చక్కాపోయింది!!







ఎగిరిపోతున్న హంసను చూచి, పురోహితుడైన రాజగురు ఆవేశంతో—'కొట్టండి! పట్టండి '! మాయపక్షి !!!' అని కేకలువేసి అందరనూ తొందరచేశాడు. తొందరచేశాడే కాని, ఆ పక్షినేమి చేయటానికి ఒక్కళ్లకూ కాలుచేతులాడలేదు. చూస్తూవుండగా, అది అంతరిక్షానికి వెళ్లిపోయింది.

ఆ పక్షివాక్కులు విన్న క్షణంనించీ అందరూ తీవ్రమైన ఆలోచనలో పడ్డారు. ఇందుకుతోడు, రాజగురు ఆవేశపడటం వారి ఆలోచనను మరింత తీవ్రతరం చేసింది. రాజ్యంలో పుట్టిన పుకారుకీ, ఈ సంఘటనకూ సంబంధమేమిటా అని ప్రతివారికీ జిజ్ఞాస కలిగింది. కాని, ఎవళ్ళకూ సరిదైన సమాధానం దొరకనేలేదు.

ఏమైతేనేమి, అమాయకుడైన పసివానికి గండం తప్పిందికదా అని ఆబాలగోపాలమూ సంతోషించారు.

ఈ సందర్భంలో ముందు రాజగురును పట్టి బంధించమని ఆజ్ఞాపించాడు రాజు. ఇలా ఆజ్ఞాపించగానే మందాకిని ఆలోచనలో పడింది. క్షణంకూడా నిలవక, ఒక్క లిప్తలో ఆమె అంతఃపురం చేరుకున్నది.

ఇదంతా కనిపెట్టి చూస్తూవున్న ఆమె తండ్రి కిరాతరాజు, ఏదో గడబిడ వున్నట్టు పసికట్టి, ఆమె వెనకాతలే తనూ వెళ్ళాడు. అతడు వెళ్ళేసరికే మందాకిని శయ్యామందిరంలో పడుకొని వున్నది.

తండ్రి ఆమెను చేరదీసుకొని, 'అమ్మడూ! జరిగిందేదో జరిగింది, విచారించకు. అదీ ఒకమేలే — పసివాడు ప్రాణాలతో వెళ్ళిపోయాడు...'అని ఇంకా ఏమో చెప్పబోతూ వుండగా, మందాకినికి శరీరంలో ఒక విధమైన బాధ ప్రారంభమయింది.

'నాన్నా! క్షమించు. ఇంతవరకు లోకంలో మంచిదాని ననిపించుకొన్నాను. ఇప్పుడు నలుగుర నోళ్లలో పడటం యిష్టం







లేదు. తీరా తొందరపడి రాజగురు చిక్కుకొనే చిక్కుకొన్నాడు. రేపు జరగబోయే విచారణలో నిజానిజాలు బయల్పడక తప్పదు. అందుకనే...' అనేటంతలో ఆమెకు వంట్లో భరింపరాని ఆవేదన పుట్టుకొని వచ్చింది.

ఆవేదనతోనే ఆమె, అతిప్రయత్నం చేసి 'నాన్నా!—పసివాణ్ని చూడుకో, జాగర్త! అన్నయ్యనికూడా ఇక్కడికే వచ్చేసి ఉండి పొమ్మను. నాకు కాలం సమీపించింది. మాటాడలేను. నేను చేసిన పనిమట్టుకు గొడవకానీయకు! నాన్నా!—పసివాడు... అర్భకుడు...'అంటూ, ప్రాణం విడిచింది.

తన కూతురు మహీపాలుడికి కలిగిన కష్టాలు చూడలేక గుండెపగిలి మరణించిందని కిరాతరాజు విలపించసాగాడు.

అంతలో ప్రమోదుడూ వచ్చాడు. "దురదృష్టవంతుణ్ని...చేతులారా పెద్దరాణిని పోగొట్టుకున్నాను. పసివాడైనా ఉన్నాడుకదా అని ధైర్యపడేటంతలో విపరీతమైన ఈ అవాంతరం వచ్చిపడి, వాడు కాస్తా ఎగిరిపోయె! పోనీ, ఇక వాణ్ణిగురించి భయం లేదు, తల్లిదగ్గరకు చేరుకొన్నాడుకదా అని సంతోషించేటంతలో, నా మందాకినికూడ నన్ను మోసగించిపోయిందే... నాగతి యింకేమికాను? ఎవరు నాకు దిక్కు? ఆ మాయదేవుడు ఇన్నిపాట్లు తెచ్చిపెట్టడానికి నేనేం పాపంచేసుకొన్నాను...?' అంటూ వలవల యేడ్చాడు.

నిమిషంలో యీవార్త నగరమంతా అల్లుకుపోయింది. మరణించిన మందాకిని పైన అందరకూ జాలికలిగింది.

మరికొద్ది రోజులకే విచారణ వచ్చింది. ఉన్నది ఉన్నట్టు చెప్పాడు రాజగురు. కుట్ర అంతా చిన్నరాణిదే నన్నట్లు ఆయన సంజాయిషీవల్ల తేలింది. కూతురు పన్నిన కుట్రలో సాయపడటానికే కిరాతరాజు








ఇక్కడ తప్పవేగాదని చెప్పి, తన మాటలు బలపరుచుకోవటానికి చూచాడు రాజగురు. కాని, ఆయనమాటలు ఒక్కళ్లూ నమ్మలేదు. చనిపోయిన రాణిమీద నేరం తోసేసి తను తప్పించుకోవటానికి చూస్తున్నాడని అందరూ ఉద్దేశపడ్డారు.

రాజు ఉగ్రుడయ్యాడు: 'పట్టం కట్టుకోవలసిన మహాపాలుణ్ణి పొట్టనుపెట్టుకోయిన మహాపాపివి నీవు. రాజ్యకాంక్షతో అమాయిక ప్రజను రెచ్చగొట్టావు, ఘోష పెట్టావు. రాజ్యమంతా అల్లకల్లోలం చేసివేశావు. నా హృదయంలో చిచ్చుపెట్టావు. నిన్నేమిచేస్తే పాపముంది ద్రోహీ! ఛీ, నా ఎదట మరి కనపడకు. నా రాజ్యంవదిలి పో!!' అంటూ మండిపడి, రాజగురుని కోట అవతలకు గెంటించివేశాడు. ప్రజలు ఆయనను చూచి 'ఛీ.ఛీ' అన్నారు.

రాజు పరాభవింపగా, లోకులు ఈసడింపగా, తలవంపులతో భల్లాణరాజ్యం వదలిన రాజగురు, మరి వెనుతిరిగి చూడనే లేదు. జన్మలో ఇంతవరకెన్నడూ ఇటువంటి అనుభవం ఎరిగివుండలేదాయన.

ఆ సమయాన తన కుటుంబం ఏమై పోతుందోననే చింతకూడా లేకపోయింది ఆయనకు. భార్యాబిడ్డలను చూచుకుపోదామనే దృష్టే కలగలేదు. 'భల్లాణరాజ్యమనే ఈ గడ్డపైన క్షణమైనా నిలవకూడదు'- ఇదే ఆయన చేసుకొన్న నిశ్చయం. ఇదితప్ప మరే ఆలోచనకూ మనసులో తావు లేకపోయింది. ఇంతటి వైరాగ్యభావంతో, రాజగురు ఒక లక్ష్యమూ సంకల్పమూ లేకండా, కాళ్ళు ఎక్కడికి తీసుకుపోతే అక్కడికే సాగిపోతున్నాడు!

పోయిపోయి, రాజగురు ఒక అటవీ ప్రాంతం చేరుకొన్నాడు. అలసి, ఒక చెట్టు కింద కూలపడ్డాడు. సొలిపోయిన ఆ సుకుమారప్రాణికి కునుకుపట్టినట్టయింది.



కొంచెంసేపటికల్లా గుర్రపుడెక్కల టకటక శబ్దం వినవచ్చింది.

అంతలో, ఒక యువకుడు ఆ దారిన వచ్చాడు. వచ్చి రాజగురును చూస్తూనే గుర్తుపట్టాడు. అతడే కిరాతరాజు కొడుకు మందపాలుడు. ఆ ప్రదేశమే కిరాతరాజ్యం.

నిమిషంలో రాజగురునకు సమస్త ఉపచారాలూ జరిగినై. మరుక్షణంలో ఆయన కిరాతరాజు దివ్యకుటీరంలో ఉన్నాడు! ఆటుతరువాత రాజగురు ఎంతో దీనంగా తన స్థితిగతులన్నీ మనసు విడిచి మందపాలునికి వెల్లడించాడు.

అందుకు మందపాలుడు ఆయనను ఊరడిస్తూ "గురూజీ!—ప్రపంచాలను నడిపించగల ప్రజ్ఞావంతులు మీరు. మీరు తలచినంతమాత్రాన జగాలు కంపించి పోతయి. తాము ఇలా వాపోవడం పాడి కాదు. ధైర్యం వహించండి. మీ ఆశీర్వాద బలం వుంటే సరి, ఇదిగో కత్తి చేతపట్టి చెబుతున్నా। ఏరోజున మందపాలుడు భల్లాణరాజ్య సింహాసనం అధిష్ఠిస్తాడో, ఆ క్షణమందే మీరు సమస్త సౌఖ్యాలూ సమకూరినవని నమ్మండి...' అంటూ భీషణ ప్రతిజ్ఞ పట్టాడు.

ఈ శపథానికి రాజగురు సంతోషించాడు. ఐతే, గాఢమైన ఆలోచనకూడా కలిగింది. 'మందాకిని మాట విన్నాను. చెడ్డాను. నలుగుర నోళ్ళలో పడ్డాను. పోతే—ఆ కిరాతరాజు నాపట్ల అనుకూలంగా వున్నట్లే కనిపిస్తాడు. కాని, పని వచ్చేసరికి తప్పుకొని తటస్థంగా వుంటున్నాడు. అతని నటన అంతు పట్టకుండావుంది. ఉండడమేమిటి? అతనికి మనుమనిమీదనే మమకారం. వానిని విడిచి క్షణం నిలవలేడు. ఇప్పుడు చూడగా- ఈ మందపాలునికి రాజ్యకాంక్ష పట్టుకొన్న సంగతి స్పష్టమైంది. తోడుగా వుండి, వీనికి భల్లాణరాజ్యం దఖలుపరిస్తే,








అన్నివిధాలా నాకు మేలయేటట్టు తోస్తుంది. పైగా, మందానికిమూలంగా వచ్చిన చెడ్డపేరు మాసిపోయి, ఎప్పటి గౌరవం ఏర్పడవచ్చు. అలా ఏర్పడిననాడు నా చాకచక్యానికి లోకమూ మెచ్చుకుంటుంది. పోతే, అటు ప్రమోదునిపైనా కిరాతరాజు మీదాకూడ ఇష్టంవచ్చినట్టూ పగ సాధింపవచ్చు. ఇన్ని పనులూ ఒక్కమారుగా నెరవేరటానికి ఇదే చక్కటి అదను. ఈ తరుణం పోనీయకూడదు' అంటూ యోచించి, 'నాయనా!–సరే, మన చేతిలో యేముంది? చేతనైన పని చేసిచూదాం లోపం లేకుండా...' అన్నాడు.

ఆ తరువాత, మంతనాలు సల్పటానికని వారుభయులూ రహస్యమందిరానికి వెళ్ళారు.

• • •

మందాకిని పోయినప్పటికి వంశం నిలబెట్టేందుకు అర్థకర్ముడైనా నిలిచివున్నాడు కదా అనే తృప్తితో, ప్రమోదుడు పసివాడిని ఎంతో అభిమానంతో కనిపెట్టి, వేయి కళ్ళలో చూచుకొంటూ వున్నాడు.

త్వరలోనే అర్థకర్ముడికి పరిణయమూ, పట్టాభిషేకమూకూడా చేసి, కొంతలో కొంత మనశ్శాంతి పొందాడు.

మరికొద్దికాలానికే అర్థకర్ముడికి కుమారుడు కలిగాడు. ఇందుకు రాజ్యంలో అందరూ మితిలేని ఆనందాన్ని పొందారు. శిశువుకు 'చిత్రభాను'డని పేరు పెట్టి, అల్లారుముద్దుగా పెంచుకొంటున్నారు. ఈ విధంగా కష్టాలు గట్టెక్కి, మంచిరోజులు వచ్చినవికదా అని సంతోషిస్తూవుండగా—

ఒకరోజున ప్రమోదుని ఆస్థానంలోకి ఒక రాయబారి వచ్చాడు.కూడా ఒక లేఖ తీసుకవచ్చాడు. అది సామంతరాజులలో ఒకడైన ఘూర్జరదేశపు రాజువద్దనుండి వచ్చిన లేఖ. ఆ లేఖలో—







'భల్లాణరాజ్యమందు 'రత్నకిరీటధారణ' అనువంశికంగా వస్తున్న ఆచారం. మేము- అనగా సామంతరాజ్యాలవారమంతా, తరతరాలనుండి ఆ రత్నకిరీటధారులైన ప్రభువులకే కైమోడ్పుచేసి కప్పములు కట్టుతున్నాము. ఈనాడు ఆ రత్నకిరీటం అదృశ్యమైంది. అర్ధకమ్ముడు కిరీటం లేని రాజు. పట్టం కట్టుకొని ప్రభువును మేము ఆమోదించలేము. ప్రభువునే ఆమోదించనప్పుడు ఇక కప్పము కట్టేదెట్లా? ఇదే మా తీర్మానం'—అని వున్నది.

కొంచెం స్థిమితపడుతూవున్న ప్రమోదునికి ఈ లేఖ గొడ్డలిపెట్టు అయింది. 'ప్రత్యుత్తరం వస్తుందిలే' అని చెప్పి, ఆ వచ్చిన రాయబారిని పంపించివేశాడు.

తరువాత, వియ్యంకుడైన కిరాతరాజుతో-

"మామా! మన భల్లాణరాజ్యానికి చెందిన సామంతరాజులు పరమసాధువులూ సదయహృదయులునూ. ఇంతకాలం నుండి లేని ఈ సంఘటన ఇప్పుడెందుకు కలిగిందిచెప్మా?' అని అంటూ,'యిప్పుడేం చేదాం మరి?' అని సలహా అడిగాడు.

అప్పుడు కిరాతరాజు బాగా యోచించి, 'మనం బదులు రాసి పంపటంకంటె, మనిషివెళ్ళి మాటాడటమే మంచిది. ఇప్పుడు సామంతరాజులున్న పరిస్థితిలో ఏ సమయాన ఎలావుంటుందో చెప్పలేము. కనుక, ఉద్యోగస్థులను పంపటానికి వీలు లేదు. పోతే వెళ్ళే రాయబారి పూర్తిగా నమ్మకస్థుడైవుండాలి. సామంతరాజులను మాటలతో దారికి తీసుకురాగల చతురుడైవుండాలి...' అని చెప్పి ఊరుకొన్నాడు.

ఈ సలహా బాగా నచ్చింది ప్రమోదునికి. 'మామా!—మన మందపాలుడు ఉండగా ఎవరినో వెతుక్కోవటమెందుకు? ఉండు...' అంటూ, వెంటనే కబురుచేసి మందపాలుని రప్పించాడు ప్రమోదుడు.





పరిస్థితులన్నీ మండపాలునికి తెలియచెప్పి, తనకు వచ్చిన ఉత్తరంకూడా చూపించాడు. "నీవు వెళ్ళి సామంతరాజులతో నా మాటలుగా ఇలా చెప్పు: 'ముందు కప్పం కట్టి మరీ మాటాడవలసింది. రత్నకిరీటధారను కేవలమూ కుటుంబ విషయమే కాని, రాజకీయాలకి సంబంధించింది కాదు. ఈ నెపంమీద కప్పం కట్టకపోయినట్టయితే అవిధేయతగా పరిగణించవలసివస్తుంది' అంటూ, నయానా భయానా మనసుకు నాటేటట్టు చెప్పి, వాళ్లు కప్పం కట్టేటట్టు చేసి, వెంటనే తిరిగి రావలిసిం" దన్నాడు.

అంటూ, రాజముద్రిక గల తన ఉంగరాన్ని ఇచ్చాడు. యిచ్చి, యిలా చెప్పాడు. 'దారిలో అమడకు ఒకటిచొప్పున రాజ విడిదెలుంటై. ఈ ఉంగరం చూపిస్తేసరి, కావలసిన సదుపాయాలన్నీ జరుగుతై. ఏరాజ్యంలో ఏపేటుకైనా యధేచ్ఛగా పోవచ్చు' అని చెప్పి పంపాడు.

అప్పుడు కిరాతరాజు, కొడుకుతో 'నాయనా—విజయం చేసుకురా. ఈ విషయం పిట్టకైనా తెలియనీయకు, జాగర్త!' అంటూ, మెలకువలు చెప్పాడు.

రాత్రనక పగలనక మండపాలుడు ప్రయాణంచేస్తూ పోసాగాడు. ఒకొక్క విడిదిలో దిగి, విశ్రాంతి తీసుకుని, తను ఎక్కివచ్చిన గుర్రాన్ని యీ విడిదిలో వదిలివేయటం, అక్కడినుండి మళ్ళీ అతను మరొక గుర్రాన్ని తీసికొని వెళ్ళటం—ఇదీ ప్రయాణంచేసే పద్ధతి.

ఇలా మూడురోజులు ప్రయాణం చేసి చేసి, నాలుగోరోజు రాత్రి ఒక విడిదిలో దిగి, అలసట ఎక్కువ కావటంచేత నడుం వాల్చాడు. అప్పుడు అతని మనసులో పరుగులెట్టిన సమస్యలు అన్నీయిన్నీ కావు. ఈ ఆలోచనలతోనే అతను గాఢ నిద్రలో మునిగిపోయాడు. మునిగిపోయివుండగా,

సరిగా అర్ధరాత్రప్పుడు—[ఇంకా వుంది]










## 3

సరిగా అర్ధరాత్రప్పుడు, గాఢనిద్రలో వున్న మందపాలుణ్ణి ఎవరో లేపినట్టయింది. చూస్తే, అతనొక సన్న్యాసి! ఉలిక్కిపడ్డాడు మందపాలుడు. సన్న్యాసి అతని భుజం పట్టుకొని, "ఉష్!- అవతలికి పోయి మాటాడుకుందాం, రా!" అంటూ, వెంట తీసుకుపోయాడు. కంఠస్వరాన్నిబట్టి ఆ సన్న్యాసి యెవరయిందీ వెంటనే తెలుసుకొన్నాడు మందపాలుడు.

తన గుర్రాన్ని నడిపించుకొని మందపాలుడు సన్న్యాసివెంట పోతూవుంటే, గుబురుగా పెరిగిన చెట్లపదున కనిపించింది. ఆ చెట్లసందుకు పోయి, సన్న్యాసి తనూ ఒక గుర్రాన్ని తీసుకువచ్చాడు. అప్పుడు ఎవరి గుర్రాన్ని వాళ్ళుఎక్కి, దౌడుతీస్తూ ఒక యేకాంతప్రదేశం చేరుకున్నారు.

"గురూ!- ఈ విడిదిలో మీ కసలు ప్రవేశం ఎలా దొరికింది? ఇప్పుడు మన కర్తవ్యం ఏమిటి?" అని అడిగాడు ఆశ్చర్యంతో మందపాలుడు.

"పసివాడివి నీకేం తెలుసు? ఎక్కడికి వెళ్ళాలన్నా సన్న్యాసికి అడ్డులేదుగా! ఇన్నాళ్ళనించి నేను పెంచిన గడ్డం ఇప్పుడు పనికివచ్చింది. దానికేం-మీ భల్లాసురాజుకు చేరిన తాఖీదు సృష్టించింది ఎవరో తెలుసా, ఇంతకూ? సామంతరాజులందరినీ మంత్రించినట్టు కట్టివేశా. 'మాకు స్వాతంత్ర్యం కావాలి. మందపాలుడే భల్లాసురాజ్యాధిపతిగా ఉండాలి' అని అందరి నోటా అనిపించా. అందరిలోనూ ఒక్క మీ తాత, అర్ధకర్ముని మామ—సామంతుడూ మగధదేశరాజూ ఐన ఆ అమరభూపతి మాత్రం








ఏదో విరసంగా మాటాడుతున్నాడట. కానీ, అతను కలిసిరాకున్నా మరేం ఫరవాలేదు," అన్నాడు, హుంకరిస్తూ రాజగురు.

"నే నిక్కడ వున్నట్టు మీకెలా తెలిసిందీ గురూ!" అని మళ్ళీ అడిగాడు మండపాలుడు ఆత్రంతో.

అందుకు రాజగురు, "అమాయకుడా!- ఈమాత్రం తెలుసుకోలేనా? మన ఏర్పాటు లన్నీ కాగానే సరాసరి ఇంటికి వెళ్ళాను. నీవు ఘూర్జరదేశానికి రాయబారిగా వెళ్ళావని తెలిసి, వెంటనే గుర్రంమీద బయలు దేరా. భల్లాణరాజ్య సేనాధిపతి ఐన మా వాడే నీ జాడలు చెప్పాడు."

ఈ మాట వినగానే, మండపాలుడు తన రాయబారపు భోగట్టాలన్నీ పూసగుచ్చి నట్టు వెల్లడించాడు.

అంతా విన్నాడు, రాజగురు. "సరే, నీ విక ముందుకు పోవద్దు. ఇక్కడినుండే మళ్ళిపో. ఘూర్జరదేశ ప్రభువును కలుసు కొన్నా నను. రాయబారానికి జవాబుగా ఇలా చెప్పు: 'కిరీటమనేది రాజచిహ్నం. అది రాజకీయానికి సంబంధించినదే కాని, కుటుంబవిషయం ఎంతమాత్రమూ కాదు. తరతరాలుగా వస్తున్న రత్నకిరీటం ధరించి నప్పుడే భల్లాణ రాజులకు మేము కైమోడ్పు చేసి కప్పం కడతాము. లేకుంటే లేదు. నిర్బంధం చేస్తే యుద్ధానికి సిద్ధమే' అను.

"ఏదోవిధంగా కయ్యానికి కాలు దువ్వి, పురెక్కించు. వాళ్లను రంగానికి దింపటం నీవంతు, తక్కిన పని అంతా నావంతు" అని చెప్పి, రాజగురు వెళ్ళిపోయాడు.

మండపాలుడు వెళ్ళింది మొదలు, ప్రమోదుడూ కిరాతరాజూ యెదురు చూస్తూనే వున్నారు. అనుకొన్నకంటె ముందుగానే వచ్చేశాడు, మండపాలుడు. అతను అడుగుపెట్టి పెట్టడంతోనే ఆత్రంతో 'ఏమయింది?' అని అడిగారు, వారిద్దరూ.







"ఏమయింది! అక్కడికి వెళ్ళిన నాకూ, నన్ను పంపిన మీకూ, తీరని అవమానం జరిగింది. రాయబారినైన నన్ను గౌరవించటానికి బదులు, బంధుత్వాలు ఏకరుపెట్టి, నానా మాటలూ ఆడిపోశారు. ఆ మాటలు కావాలన్నా నోట పలకలేము. సామంతు లందరి తరఫునా పెద్దనని చెప్పి, పిచ్చికూతలు కూసే ఆ ధూర్తరాజును తలకొట్టి మొలవేయాలి, నాకు నిద్రపట్టాలి. యుద్ధసన్నాహాలు చేయండి ఇప్పుడే. నేను పోయి, మావాళ్లను తయారులో వుంచుతా" అంటూ, మండపాలుడు కిరాతరాజ్యానికి ప్రయాణమయ్యాడు.

మండపాలుడు చెప్పిన ఒక్కొక్క మాటకూ ప్రమోదునికి రోషం రేగి, రగులుకువచ్చింది. 'ఆ ధూర్తుడికి ఎంత సాహసం! యుద్ధమంటే ఏమో అనుకొన్నట్టుంది. రుచి చూపిద్దాం!' అన్నాడు పట్టరాని అహంకారంతో, ప్రమోదుడు.

ఇప్పుడు ప్రమోదుని మనస్సు పరిపరి విధాల పోయింది. 'మండపాలుని సైన్యం ఉండనేవున్నది. అదీగాక, మగధసేనాధిపతి-అర్ధకర్ముని మామ ఒకడున్నాడుకదా! ముందు అతనికివ్రాసి సాయం కోరాలి' అనుకొన్నాడు. కిరాతరాజును సలహాచేసి అక్కడికి ఒక నమ్మకస్థుణ్ణి వెంటనే రాయబారిగా పంపాడు.

కిరాతరాజ్యం చేరుకొన్న మండపాలుడు తన కోయవాళ్లందరికీ తరిఫీదు ఇవ్వటానికి తగినవాళ్లని నియమించాడు. తరువాత, భల్లాణరాజ్యానికి తిరిగివస్తూ, ఒక రాజవిడిదిలో దిగాడు. మగధదేశానికి బయల్దేరిన రాయబారికూడా ఆ సమయంలో ఆ విడిది లోనే మకాంచేయటం తటస్థించింది.

మాటా పలుకూ ఆడుతూ, రాయబారిని జాబు చూపమన్నాడు, మండపాలుడు. అతడు సందేహించాడు. అప్పుడు మండ








పాలుడు, రాజముద్ర గల ఉంగరం చూపగా రాయబారి ఉత్తరం ఇవ్వక తప్పలేదు.

మందపాలుడు తెరిచిచూచాడేకాని, ఉత్తరంలో ఒక్కముక్కా అర్థంకానేలేదు. అవన్నీ రహస్యపు సంజ్ఞలు!! కావాలంటే అతను అధికారబలం చూపి ఉత్తరం తీసుకోనేవచ్చు. కాని గొడవ పడదలచుకో లేదు. తిరుగుదలలో జవాబు తెస్తాడుకదా, అప్పుడు చూడవచ్చునని తలిచి, ఆ విడిది లోనే ఎదురుచూస్తూ ఉండిపోయాడు.

తీరా, రాయబారి మగధకు వెళ్ళేసరికి, అమరభూపతి తండ్రి మరణశయ్యపైన వున్నాడు. నాలుగు రోజులయిన తరవాత గాని ఆ జాబు అందుకోనేలేకపోయాడు, అమరభూపతి. అందుకొని, వెంటనే అనుకూలంగా జవాబు వ్రాసి పంపాడు. ప్రత్యుత్తరం పట్టుకొని రాయబారి భల్లాణరాజ్యం చేరుకొన్నాడు. జవాబు చూచుకొని ప్రమోదుడు పరమానందభరితుడైనాడు.

రాయబారికోసం విడిదిలో వేచిఉండి, మందపాలుడు విసిగిపోయాడు. 'వీడు టక్కరి. మరొకదారిని తప్పించుకు పోయి వుంటాడు' అని అనుమానించి, భల్లాణ రాజ్యం పోకుండానే ఇంటిముఖం పట్టాడు. ఏమంటే, తను ఇక్కడ రాయబారి కోసం కనిపెట్టుకొనివుండగా, రాజగురు ఒకవేళ తనకోసం యింటికి వచ్చాడేమో?

మందపాలుడు ఇంటికి వెళ్లేసరికి నిజంగా రాజగురు రానే వచ్చాడు. రాయబారినిగురించిన వృత్తాంతం అంతా విని, "సరే, మంచిపనే చేశావు. ఏమైనా, మనం చాలా జాగర్తగా ఉండవలసిన సమయం సుమా ఇది. ఏర్పాట్లన్నీ చేసేవచ్చాలే" అని హెచ్చరించాడు.

ఏమయితేనేం, పోరు పొసగింది. యుద్ధం సిద్ధమయింది. ఫలానారోజున ఇన్నిగంటల ఇన్ని నిముషాలకు సరిగా, ఫలానా మైదా







నంలో తలపడాలి అని ప్రకటన జరిగింది. ఇరుపక్షాలలోనూ అతిచురుకుగా యుద్ధ ప్రయత్నాలు సాగిపోతున్నాయి.

భల్లూకరాజ్యప్రజలు సంతోషంతో యుద్ధానికి తొడుపడసాగారు. ఏవిధంగా చూచినా వారిబలం అనుకూలంగానే కనిపించింది.

యుద్ధారంభం కావలసిన ఆ రోజూ, ఆ గంటా, ఆ క్షణమూ వచ్చింది. మైదానానికి నడుమ బారులుతీర్చి, తయారుగా వున్నాయి భల్లూకరాజ్యసేనలు. చూస్తే, సామంతుల సేనలు పలచపలచగా కనబడినై. ప్రమోదునికి ధైర్యం చిక్కింది.

యుద్ధం ముమ్మరమయింది—

మంచి సమయంలో భల్లూకరాజ్య సేనాధిపతి వెనక్కు తగ్గాడు. వస్తాన్న అమరభూపతి సాయం రాలేదు. పైగా, వచ్చిన కోయదళాలేమో ఎదురుతిరిగి సామంతుల సైన్యాలతో చేరిపోయినై. ఈవిధంగా, అన్ని కారణాలవల్లా భల్లూక రాజ్యానికి అపజయమే కలిగింది.

భల్లూక సైనికులు చెల్లాచెదరు కావటంతో, ప్రమోదుడు ఒంటిపాటు అయిపోయాడు. ఇంతవరకూ ఒక కోయవానిగా కనబడుతూ వచ్చిన రాజగురువు, విచ్చలవిడిగా తిరుగులాడే మందపాలుని పిలిచి "చూస్తావేం? బంధించు ప్రమోదుణ్ణి" అని ఆజ్ఞాపించాడు.

ఏమీ పాలుపోక నిలుచుండిపోయాడు మందపాలుడు. "ఊఁ! ముందు బంధించు. చుట్టరికం చూస్తేకాదు" అని గద్దించాడు రాజగురువు. ఎదురాడలేక, మందపాలుడు వెంటనే ప్రమోదుణ్ణి ఖైదు చేయించాడు. అప్పుడు తన కోయవేషం విప్పేసి, రాజగురువు వికటంగా నవ్వాడు. ప్రమోదునికి పట్టరాని కోపమూ, దుఃఖమూ ఒక్కసారిగా కలిగినై. ఆదే సమయంలో, కిరాతరాజూ అర్ధకర్ముడూ కనిపించటం







లేదని ఒక వార్త వచ్చింది. ఇందుకు దిగ్భ్రమ చెందారు మండపాలుడు. 'సరే, చూదాంలే' అన్నారు, నిబ్బరంగా రాజగురు.

అంతలో—కొంతదూరాన ఏదో సైన్యం వస్తూన్న అలికిడి ఐంది. చూడగా, అది మగధరాజు సైన్యమే. అంతా తీరినతరవాత యిప్పుడు వచ్చారు, అమరభూపతి. వచ్చి, స్థితిగతులన్నీ తెలుసుకొన్నారు. భల్లాణ రాజ్యానికి సాయపడలేకపోయినందుకు చింతించారు. కానైతే, తోడి సామంతులతో వైరం పెట్టుకోదలచలేదు. సమయానికి అందుకోలేకపోవటానికి తండ్రిజబ్బు సాకుపెట్టి, యుక్తిగా తప్పించుకున్నారు.

ఈ వాలకమంతా కనిపెట్టుతూవున్న ప్రమోదుడు అమరభూపతిని చూచి 'ద్రోహీ!' అనిమాత్రం అని ఊరకొన్నారు.

ఇంకిప్పుడు మండపాలుని పట్టాభిషేక మహోత్సవం చూడటానికని అందరూ భల్లాణరాజ్యం చేరుకున్నారు. అందరూ కనిపిస్తున్నారుకాని, ఎంత వెతికినా అర్ధకర్ముని భార్యా, ఆమెకొడుకు చిత్రభానుడూ కనిపించలేదు. అంతఃపురంలో వెతికారు, శయ్యామందిరంలో వెతికారు. మరెక్కడనో వెతికారు. వాళ్లు కనిపించనేలేదు.

మండపాలుడు విస్తుపోయారు. రాజగురు యోచనలో పడ్డారు. రాజులందరూ నిశ్చేష్టులైనారు. తల్లిని, కొడుకునూ వెదికి పట్టమని వేగిరపెడుతూ ఆజ్ఞాపించారు రాజగురు. నిలుచున్నపాటున భటులు బయలుదేరి, నలుదిక్కులకూ గబగబ పరుగులెత్తారు.

ఎప్పుడైతే ప్రమోదుణ్ణి ఖైదుచేశారని తెలిసిందో, అక్షణమందే అర్ధకర్ముడి భార్య తన రాణిదుస్తులు తీసివేసింది. ఒక దాసిగా తయారయింది. కొడుకు చిత్రభానుడికి వికారంగా మసిపూసి ఒక పేదబాలునిలా కనబడేటట్టు చేసింది. ఇలా మారువేషంలో





వుంది, తమను ఎవరూ అనుమానించకుండా తప్పించుకొని, చాకచక్యంతో కోటలో నుంచి బయటపడింది.

బయటపడిందేకాని, ఆ క్షణంనుంచి పాపం, ఆమెకు కలవరపాటు ఎక్కువే అయింది. ఐదేళ్ల పసివాణ్ణి వెంటబెట్టుకుని పరుగెత్తవలెని వచ్చింది. ఎండకన్నెరుగని సుకుమార ప్రాణి ఎంతకని పరుగెత్తగలదు! వెళ్లి వెళ్లి, కొంతదూరంలో ఒక చెట్టుకింద సొలిపోయింది. కుర్రవాడు ఆమెను కదిలించాడు. ఎంతకూ ఆమె లేవలేదు. ఏమి తోచక "అమ్మా! అమ్మా!!" అనుకొంటూ, ఒక దారీ తెన్నూ లేకుండా, కాళ్లు ఈడ్చుకుపోయినంతవరకూ పసివాడు కంగారుతో పోసాగాడు.

ఆలా కుర్రవాడు పోయిన మరికొద్ది సేపటికల్లా భటులు వెతుక్కొంటూ ఆచోటికి వచ్చారు. వచ్చినవారిలో ఒకడు అర్ధకర్ముని భార్యను ఇట్టే గుర్తుపట్టేశాడు.

భటుల అలికిడికి ఆమె లేచింది. లేస్తూనే, పసివాడు కనబడక, వెతకనారంభించింది. ఆ భటులే వానిని ఏమో చేసి వుంటారనుకొని ఆమె, "ఏడీ, నా చిత్రభానుడేడీ, చెప్పండి! చెప్పండి!!" అంటూ ఒక్కపెట్టున విలపింపసాగింది. కుర్రవాడిని దాచివేసి ఆమె మాయచేస్తున్నదని వాళ్లు అనుమానించారు. "కుర్రవాడు ఏడీ? ఎక్కడ దాచావు, చెప్పు" అంటూ ఆమెను గద్దింపసాగారు.

చివరకు వాళ్లు, ఆమెను పట్టి తీసుకపోయి, రాజగురు ఎదుట నిలబెట్టారు. రాజగురు ఉగ్రుడయ్యాడు. "ప్రమోదుణ్ణి వేసిన గది పక్కనే దీనిని పడవేయండి. పట్టాభిషేకం కాగానే చూచుకోవచ్చు. మాయలవాడు చిత్రభానుణ్ణి పట్టండి. ఆ దుర్మార్గుడు కిరాతరాజుని అర్ధకర్ముణ్ణి కూడా వెతకండి. శత్రుశేషం ఉండకూడదు" అన్నాడు కఠోరంగా. అప్పుడు— [ఇంకా వుంది]









## 4

అప్పుడు రొజుకొంటూ వచ్చాడు ఒక సేవకుడు. "ప్రభూ!—కిరాతరాజూ, అర్ధకర్ముడూ చచ్చిపోయారు" అని చెప్పాడు.

ఈ మాట వింటూనే, "చచ్చారూ? వదిలింది పీడ!" అన్నాడు రాజగురు ఏదో పెద్ద భారం దిగిపోయినట్టుగా. "ఆ క్రూరవిధవనికూడా వెతికిపట్టండి!" అంటూ హెచ్చరికకూడాచేశాడు. అంతలోనే, యుద్ధరంగంనుంచి ఆ రెండు కళేబరాలనూ సిపాయిలు మోసుకువచ్చారు.

రాజగురు అలా అన్నందుకు మందపాలుడు మనసులోనే చాలా ఖేదపడ్డాడు. కాని ఏమీ అనలేకపోయాడు. తండ్రి మరణానికి ఎంతగానో దుఃఖించాడు. ఇది కనిపెట్టాడు రాజగురు. మందపాలునికి తిరుగా తండ్రిపైన మమకారం కలగటం చూచి, అతనికి వానియందు వెంటనే విరక్తిభావం పొడమింది.

ఈ వార్త చెవినిపడిందే, చెరలో వున్న ప్రమోదుడు కూలిపోయాడు. అర్ధకర్ముని భార్యకు స్మృతి తప్పింది.

యుద్ధఫలితంగా వచ్చిన మరణవార్తలకు సామంతులందరిలో విలపించినవాడు అమరభూపతి. ఏమీ?—కన్నకూతురా చెరలో వుండె! కనుగందు కనపడకుండా పోయె! అల్లుడు అర్ధాంతరంగా చచ్చె! ఇంకేంకావాలి ఇంతకంటె?

తీరని దుఃఖంలో మునిగివున్న అతను పట్టాభిషేకంలో పాల్గొనేదేమిటి? అయినా, నలుగురితోపాటు ఉండక తప్పిందికాదు. అతని శరీరమే వున్నది కాని, మనసు అక్కడ లేనేలేదు.








పట్టాభిషేకం జరగటం ప్రజలకేమంత యిష్టతగా కనిపించలేదు. ఆ కారణంగా భల్లాణరాజ్యంలో గొప్ప మార్పు వచ్చింది. ఏమి అంటే: ఇప్పుడీయుద్ధం కేవలమూ అధర్మయుద్ధమని అందరకూ తెలియటం. ప్రమోదుడూ, అర్ధకర్ముని భార్యా బందీలై వుండటం - ఎక్కడినించో వచ్చిన మందపాలుడు గద్దె యెక్కటం - వీటన్నిటికేమి ?- నిరపరాధి ఐన అర్ధకర్ముడూ, వానిని కనిపెట్టుకునివున్న కిరాతరాజూ మరణించటం, —పాపం! పసివాడు, చిత్రభానుడు కనిపించకపోవటం—ఇవన్నీ ప్రజకు సహింపరాని విషయాలయినై.

"మా మారాజును విడిచిపెట్టండి! మా పట్టమహిషిని విడిచిపెట్టండి! ప్రమోద మహారాజే మాకు ప్రభువుగా వుండాలి!" అంటూ వాళ్లు గగ్గోలుపెట్టారు.

మందపాలుడేమీ మాటాడలేకపోయాడు. రాజగురే ప్రజను సముదాయించటానికి యత్నించాడు. అంతేకాదు, వారి వుద్దేశానికి అనుకూలంగా దండోరాకూడా వేయించాడు. కాని, అదెవళ్లూ చెవినిపెట్టలేదు. దానిపైన రాజగురు ఉగ్రుడై, ప్రజను హింసింపసాగాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

ఏమయితే కాని అని, చకచకమంటూ పట్టాభిషేకపుఏర్పాటులు చేయసాగాడు, రాజగురు. ఈ సందడిలో మగధరాజ్యం నుంచి ఒక సేవకుడు, అమరభూపతి తండ్రి చనిపోయిన వర్తమానం తెచ్చాడు.

కష్టాలపైన కష్టాలు వచ్చిపడినందుకు దుఃఖించాడు అమరభూపతి. మందపాలునివద్ద, రాజగురువద్ద సెలవుతీసుకొని, తక్షణమే తన రాజ్యానికి మరలిపోయాడు. కాని మనస్సంతా మనుమని మీదనే వున్నది!

లాంఛనప్రాయంగా మందపాలునికి పట్టాభిషేక మహోత్సవం జరిగిపోయింది. ఎవళ్ళ యిళ్లకు వాళ్లు వెళ్ళిపోయారు.










ఇంకిప్పుడు—హింసామార్గంవల్ల ప్రజను దారికి తీసుకరాలేము, అని రూఢిచేసుకొన్నారు రాజగురు. అయితే, మరి ఎలా లొంగదీయటం అని యోచించి, 'ఒక ఏడేళ్ళవరకూ ఏవిధమైన పన్నులూ మీరు కట్టనక్కరలేదు' అని అంటే, చచ్చినట్టు ప్రజ మన దారికి వస్తారుకదా అని నిశ్చయించుకొన్నారు. అయితే, ఆ ఏడేండ్లూ రాజ్యాంగాన్ని నిర్వహించటం ఎలా? భల్లాణరాజ్యపు ఖజానా యుద్ధంవల్ల ఖాళీ ఐపోయిందే? ఏంచేసేది? బాగా ఆలోచించి, రాజగురు వెంటనే ఒక తాఖీదు ఇలా సామంతరాజులందరికీ పంపించాడు:

"మీరు నిష్కారణంగా ప్రకటించిన ఈ యుద్ధంలో భల్లాణరాజ్యప్రజ ఎక్కువగా నష్టపడి, నలిగిపోయారు. వారిని కాపాడటం ప్రభువులమైన మాకూ, మా సామంతులైన మీకూ విధిఅయివున్నది. ఏడేళ్ళవరకూ ప్రజనుండి పన్నులేమీ వసూలుచేయకూడదనీ, మన రాజ్యం మామూలుస్థితికి వచ్చేవరకు అవసరమైన సదుపాయాలన్నీ, వారికి చేయాలనీ నిశ్చయించాము. ఈ పని కొనసాగాలంటే మీరందరూ చాలా తోడుపడాలి. ఇప్పుడు జరుగుడుగా ఈ సమయంలో, ఖజానాకు చేరవలసిన కప్పము రెండింతలుగా కట్టటం మీరు చేయవలసిన మొట్టమొదటి సాయం..." అని ఆ తాఖీదులో వ్రాసిఉన్నది.

తాఖీదు చూడగానే సామంతులందరూ చేరి ఘూర్జరరాజు పెద్దరికంకింద సమావేశమయ్యారు. ఉన్న మారాజును వదులుకుని, లేనిపోని కష్టాలు కొనితెచ్చుకున్నామే అని వారు చాలా విచారించారు. ఎంత చర్చించినా, ఫలితం తేలలేదు. చివరకు వారు అమరభూపతిని కలుసుకొని యోచించారు. అనుభవజ్ఞుడైన అమర







భూపతి మంచిచెడ్డలూ, ముందువెనుకలూ బాగా యోచించి—

"ఇప్పుడు మనం ఓర్పు వహించవలసిన పరీక్షాసమయం. మనం ఏపాటి ఉద్రేక పడినా, ఏంచేసినా ఆ రాజగురు అధీనంలో వున్న ప్రమోదుడికీ, అర్ధకర్ముని భార్యకూ ప్రమాదం కలగవచ్చు. రాజగురు బహు క్రూరుడు. ఏపనికైనా వెనుదీయడు. కనుక, ఈ పరిస్థితిలో వాడు ఎటువంటి హింసలు పెట్టినా అణిగిమణిగి వుండటమే మంచిది. ఇప్పుడు మనం ఆ పసివాణ్ణి ఎలా అయినా వెతికితెచ్చి కాపాడుకోవటం ముఖ్యం" అంటూ సలహా చెప్పాడు.

సామంతరాజులకు ఈ మాటలన్నీ బాగా నచ్చినై. కొంతమంది వెంటనే పసివానిని వెదకటానికని గుర్తులు చెప్పి చారులను నలుదిక్కులా పంపించారు.

అతని సలహాను అనుసరించి సామంతులందరూ ఇలా ప్రత్యుత్తరం వ్రాసి పంపించారు: "మీరు వచ్చి మాకు బోధించిన హితవులన్నీ అక్షరాలా శిరసావహించాము. మాకు యుద్ధంకొరకు చాల ఖర్చులయినై. రత్నకిరీటం లేని రాజులకు కప్పము కట్టనక్కరలేదని చెప్పగా, నిజమేననుకొని నమ్మి, అప్పుడు అలా జవాబు వ్రాశాము. జవాబుకు ప్రతిఫలంగా వచ్చిన యుద్ధంలో పాల్గొని, కష్టనష్టాలకు పాల్పడ్డాము. ఇప్పుడింతలోనే మీ మనసు ఇలా మారిపోతుందని మేమెన్నడూ తలచలేదు. యుద్ధరంగం నుండి ఇంటికి చేరకముందే కప్పము కట్టాలెనని శాసిస్తారని, అదీ రెండింతలుగా కట్టమంటారని కలనైనా ఊహించలేక పోయాము. భల్లాణరాజ్యం మీకు హస్తగతమైనదే, వాగ్దానంచేసినట్టుగా మాకేవో స్వర్గసౌఖ్యాలు కలుగుతవని ఆశించాముకాని, ఇటువంటి కఠినశిక్ష విధిస్తారని అనుకోలేదు. మా కష్టనిష్ఠురాలు విన్నవించు





ఉందామనుకొన్నా, ఇప్పుడు మీరు ఆలోచించేటంతటి స్తిమితంలో ఉన్నట్టు తోచనందున, ఇక విరమిస్తున్నాము."

సామంతుల ప్రత్యుత్తరం చూచి, రాజగురు ఏమనటానికీ వీలుకాలేదు. "నా మంత్రమే నాకు బెడిసికొట్టిందే! నే చెప్పిన ఉపాయాలే నాకు భస్మాసుర వరాలుగా పరిణమించినవే!!" అని వలపోసి, మళ్ళీ తీవ్రమైన యోచనలో పడ్డాడు.

అటు ప్రజల ఘోష! ఇటు సామంతుల దూషణ! గట్టిగా ఒత్తిడిచేస్తే ఎక్కడ యుద్ధానికి వస్తామంటారో అన్న భయంచేత వాళ్ళని ఏమీ అనలేకపోయాడు. ఏమిచెప్పి నమ్మించుదామన్నా, ముసలిరాజునూ, అర్థకర్ముని భార్యనూ వదిలితేకాని ప్రజ ఊరుకొనేట్టులేదు. విడిచిపెట్టితే కథ అడ్డంతిరుగుతుందాయిరి. ఎలా? ఇందులో ముందు ఒక అవాంతరమైనా దాటితేకాని వీలులేదు. అప్పుడు మెరపులాగ ఒక యోచన తట్టింది. అయితే, తనతో మందపాలుడు ఏకీభవిస్తాడనే నమ్మకం లేకపోయింది.

కొడుకును చేరబిలిచి, రాజగురు తన మనసులోని వ్యూహం వెల్లడించాడు. కొడుకు వెంటనే ఆమోదించాడు. అంతేకాదు, ఈ




వ్యూహమే నెరవేరినట్టయితే, తనకు చిరకాలంనుంచి గల కోరిక - భల్లాణరాజ్య సింహాసనాన్ని ఆక్రమించటం - అట్టే తీరిపోగలదనికూడా చెప్పాడు.

కొడుకు ఈ అభిలాషను వెల్లడించగానే రాజగురు మనసు అతివిచిత్రంగా మారిపోయింది. ఇందుకు తోడు, సేవకులు తిరిగి వచ్చి చెప్పిన మాటలనుబట్టి చిత్రభానుడు చచ్చిపోయాడని తెలియవచ్చింది. కాగా, మందపాలుని అవలకు నెట్టివేసి, కొడుకునే గద్దె యెక్కించుదామన్న ఆశ అంకురించి, వృద్ధికాజొచ్చింది. తండ్రికొడుకులు ఇద్దరూ ఒకటై, ఆలోచనలో పడ్డారు.







మరునాడే తమ పన్నాగం అమలు జరుపుదామని కట్టుదిట్టాలన్నీ చేశారు. 'నే నక్కడనే వుండి స్వయంగా యేర్పాటులన్నీ చూస్తాగా!' అని తండ్రికి ధీమా చెప్పాడు, పిన్నవాడు. కొడుకు తెలివితేటలకూ, ధైర్యసాహసాలకూ రాజగురు లోలోన సంతోషించాడు. ఇంకేమున్నది? తన ముద్దులకొడుకు భల్లాణ రాజ్య సింహాసనంపై కూర్చునివుంటే కళ్ళ వేడుకగా చూడటం రోజులలో పనేకదా, అని పొంగిపోయాడు.

తండ్రి కొడుకులు అనుకొన్నప్రకారం, ఆనాటి రాత్రి—

రాజగురు కొడుకు పనివాళ్లను రప్పించి, అద్భుతమైన సాధనాలేవో యిచ్చి, కారాగారానికి నిప్పుముట్టించమని ఆజ్ఞాపించాడు. ఏయే తావులు ముందుగా అంటుకోవాలో చెప్పాడు. పైగా, ముట్టించవలసిన సమయంకూడా చెప్పాడు. ఇదంతా ఎవళ్ళకూ తెలియదు! అనుకొన్నకంటె ముందుగానే నిప్పంటుకుంది. చూస్తూ వుండగానే మంటలు యెగసివచ్చినై. అప్పుడు అక్కడకు వచ్చిన రాజగురు కొడుకునకు ఆకస్మాత్తుగా సంశయం కలిగింది. ప్రమోదుడి గది అంటుకున్నదా, లేదా? అర్థకర్మనిధార్యం వుండే గది ఆహుతి అయిందా, లేదా? ఈ వేగిరపాటుతో ఆతను ఆ రెండు గదులవద్దకూ గబగబమంటూ పోబోయాడు. కాని, అంతలోనే మండుతూ వున్న దూలం మీద పడింది!

చూడబోతే, నగరమంతా గోలగోల! కంగారుతో లేచారు ప్రజలు. అటు ఇటు పరుగులెత్తారు. కాళ్ళూ, వళ్ళూ కాల్చుకున్నారు. యేకధారగా ఏడ్చారు. పెడబొబ్బలు పెట్టారు.

ఈ యేడుపులేమీ లక్ష్యపెట్టలేదు అగ్నిదేవుడు. తన పని తను చేసుకొనిపోతూనే





వున్నాడు. అప్పుడే జ్వాలలు ఆకాశానికి అంటుతున్నవి. రాత్రి పగలుగా వెలిగింది!

కాస్త నిబ్బరం కలవాళ్లంతా నీళ్లుమోసి అగ్గి ఆరుపబోయారు. యిసుక తెచ్చి పోయ సాగారు. ధైర్యవంతులు చొరుచుకుపోయి, వీలైనంతవరకు, కారాగృహపు గదుల తాళాలు పగలగొట్టి లోపలివాళ్లను బయటికి తీసుకువచ్చారు.

అంతలో ఈ వార్త కోటలోకి ప్రాకిపోయి మండపాలుడుకి తెలిసింది. కలవరపడ్డాడు. 'ఏమి ఈ ఘోరం! యెవడుచేసిన పని? ఈ ప్రమాదంలో, అర్ధకర్ముని భార్యగాని చచ్చిపోదుకద! నేనే కుట్రచేసి చంపానని ప్రజలు అనుకొని ఎదురుతిరగరు కద! ఇప్పుడున్న పరిస్థితులలో ఇటువంటి నిందలు నెత్తిన పడటమూ పెద్దపనికాదు!' అనుకొంటూ, ఉన్నవాడున్నట్టుగానే కారాగారానికి పరుగెత్తాడు. ఎంతమంది వద్దన్నా ఆగక సాహసించి, లోపలకు దూకాడు. ప్రమోదుడు బంధింపబడిన గదితాళాలు పగలగొట్టి, మరుక్షణంలోనే ప్రమోదుణ్ణి భుజాలపైన వేసికొని బయటకి వచ్చాడు. తిరిగి వెళ్ళి, అర్ధకర్ముని భార్యఉండే గది పగలగొట్టి చూచాడు. ఆమె మసిబారి



చచ్చిపడివున్నది! ఇది విని అందరూ గొల్లుమన్నారు! ఈవార్తవిన్న ప్రతివాళ్లకూ లోకమే చీకటిగా తోచింది!

తాళం బిగించివుండటంవల్ల తప్పించుకుందామన్నా ఆమెకు వీలుకాలేదు.

ఘోరం! దుర్భరం! ఇంకా యెంతో మంది తక్కిన గదులలో చచ్చిపడివున్నారు.

అంతలో రాజగురుడు అక్కడికి వచ్చాడు! మంటలు చూచాడు. మతిపోయినట్టుగా కారాగారమంతటా కలియదిరిగాడు. తల వనితలంపుగా దూలంకింద తన కొడుకు చచ్చి పడివుండటం చూచి, స్మృతితప్పి అక్కడనే సొలిపోయాడు!





తల్లిని విడిచిపోయిన చిత్రభానుడికి 'మిత్రానందు'డనే ఒక మహాఋషి దర్శన మయింది. ఆ మహర్షి యెవరో కాదు. ఆనాడు ప్రమోదమహారాజుకు ఫలం మంత్రించి యిచ్చిన సిద్ధుడే!

మిత్రానందుడు మహాయాగం ఒకటి తలపెట్టాడు. సంకల్పసిద్ధికోసమని శిష్య బృందంతోసహా, భల్లాణరాజ్యానికి సమీపం లోనే ఒక అరణ్యమందు అప్పుడు ఉనికి యేర్పరుచుకొని వున్నాడు.

యాగాన్నిగురించిన ప్రయత్నంలో బయలుదేరి పోతూవుండగా, అదృష్టవశాత్తు ఈ చిత్రభానుడు తారసపడ్డాడు. చూస్తూనే ఆయన, దివ్యదృష్టివల్ల పసివాని పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకొన్నాడు. 'అబ్బాయీ!—ఆ మాసిపోయిన పైగుడ్డ విప్పి, అవతల పారవేసెయ్యి' అన్నాడు. వెంటనే వానిని తనకూడా ఆశ్రమానికి తీసుకపోయాడు.

మిత్రానందుని శిష్యకోటిలో చేరినప్పటి నుంచీ చిత్రభానుడు అతిచురుకుగా అంచెల మీద విద్యలన్నీ అభ్యసింపసాగాడు. సమస్త శాస్త్రాలూ నేర్చి గురువుకు ప్రియ శిష్యుడైనాడు. మిత్రానందుడు వానిని ఎంతో ఆదరంతోనూ, అభిమానంతోనూ చూస్తూ, తగినవాళ్లచేత గుర్రపుస్వారి, విలువిద్య మొదలయినవన్నీ నేర్పించి, గొప్ప ప్రవీణుని గా తయారు చేశాడు.

ఈవిధంగా చిత్రభానుడు పది సంవత్స రాలపాటు మిత్రానందుని ఆశ్రమంలో ఉండేసరికి, ఆతడొక శూరునిగా, వీరునిగా రాణించే లక్షణాలన్నీ వానిలో కనబడినై.

బాగానే వున్నదింతవరకు. అయితే— పాపం, పసివాని విషయంలో గట్టిచిక్కు ఒకటి తటస్థించింది. ఆతని విద్యాభ్యాస మయితే దిగ్విజయంగానే పూర్తి అయింది. సమస్తశాస్త్రాలలోనూ ప్రవీణుడయ్యాడు.

కాని—

[ఇంకా వుంది]








## 5

కాని—చిత్రభానుడికి రోజూ ఒక చిత్రమైన కల రావటం ప్రారంభించింది. ఆ కలలో ఎవడో కనబడి, "నాయనా, చిత్రభానూ!—నా ఆత్మకు కాంతి కలిగించవూ? చిత్ర భానూ!—నా ఆత్మకు కాంతి కలి గించవూ?..." అని జాలిగా అడుగుతూ ఉండేవాడు.

పసివానికి ఇదేమీ బోధపడలేదు. రోజు రోజుకీ ఆ కలలో కనబడే వ్యక్తి ఇంకా యెక్కువ జాలిగా బతిమలాడినట్టు అని పించింది.

ఇది కలగదా అని మొదట తేలికగా తీసి పుచ్చాడు, చిత్రభానుడు. కాని, ఆదేపనిగా రోజూ కల రావటంతోనూ, అంతకంతకు అది ఎక్కువ కావటంతోనూ, పసివానికి జిజ్ఞాస కలిగింది.

ఏమీ పాలుపోక, ఒకనాడు ఈ సంగతి గురువుకు వెల్లడించి, 'ఇందులో అంతరార్థమేమైనా వున్నదా?' అని ప్రశ్నించాడు.

అందుకు మిత్రానందుడు "లేకేమి నాయనా!—ఇలాంటి కల నీకు రావటంలో ఎంతో అంతరార్థమున్నది. విను" అని ఇలా ప్రారంభించాడు:

"...ఒకప్పుడు ఇంద్రసభలో ఒకానొక గంధర్వుడు ఉండేవాడు. ఆతనికి యిద్దరు భార్యలు. పెద్ద భార్యకు ఒకడూ, చిన్న భార్యకు ఒకడూ కొడుకులున్నారు.

ఆ గంధర్వునికి దేవేంద్రసభలో గొప్ప ఉద్యోగం. ఆ వుద్యోగానికి గడువు ఇరవై సంవత్సరాలు. గడువు తీరినతరువాత ఆతని సంతతివారు ఆ పదవిని పొందవచ్చు.







సంతతి లేకపోయినట్టయితే అతడే మరి ఇరవై సంవత్సరాలు పనిచేయవచ్చు. ఇదీ ఆ ఉద్యోగం పద్ధతి.

ఇప్పటి గంధర్వుడికి ఉద్యోగకాలం పూర్తిఐపోయింది. న్యాయప్రకారం ఉద్యోగం అతని పెద్దకొడుకునకు రావాలి. ఐతే, వాడిని తప్పించివేసి తన కొడుకును ఆ పదవిలో పెట్టాలెనని చిన్నభార్యకు ఆశ కలిగింది.

చిన్నభార్య గడుసుది. భర్తను ఎక్కువగా ఆకర్షించగలిగిన చతురమతి. పోతే— పెద్దామె కొడుకు సాధువు. వానికి తల్లి ఎంతో పినతల్లి అంతే. ఈ కీలక మెరిగిన చిన్నభార్య సవతికొడుకును చేరదీసి,

"నాయనా!—నేనొక వ్రతము సంకల్పించి వున్నాను. ఆ వ్రతానికి దేవతలందరినీ ఆహ్వానించాలి. ప్రపంచంలో ఉండే పుష్ప జాతులన్నిటితో వారిని పూజచేయాలి. ఇప్పటికి అన్నిరకాల పుష్పాలూ అమరిపోయినై. నీలిరోజామట్టుకు దొరికింది కాదు. దీని కోసమే వ్రతం నిలిచిపోయింది. ఏ శ్రమ అయినా పడి ఆ నీలిరోజా తెచ్చిపెట్టి, నా వ్రతం పూర్తిచేసే బాధ్యత నీది. వెళ్లు. అమ్మతో నే చెబుతాలే" అని చెప్పి, వానిని సాగనంపింది.

ఆనాడు ఎంతసేపయినా బిడ్డడు ఇంటికి రాకపోయేసరికి, వాని తల్లి కలవరపడి, వెతకనారంభించింది. ఇది కనిపెట్టిన చిన్నభార్య అక్కడికి వచ్చి "అక్కా!—కుర్రవాడికోసం నీవేమి భయపడకు. 'స్నేహితులతో పోయి చిత్రమైన పుష్పాలు కోసుకు వస్తాను' అంటూ, హడావిడిగా భూలోకానికి వెళ్లాడు" అనినమ్మేటట్టుగా చెప్పింది. కారణం తెలియటంతో పెద్దామెకు కంగారు తగ్గింది.

ఇంతలో—గంధర్వుని ఉద్యోగానికి తగినవానిని నియమించే రోజు వచ్చింది. అతని పెద్దకొడుకు అక్కడ లేకపోవడం చేత, తరువాత అర్హతగల తన కొడుకును





ఇంద్రసభకు పంపించింది చిన్నభార్య. వానికి ఆ వుద్యోగం లభించటంతో చిన్నభార్య సంతోషించింది.

ఈ సమయంలో తన కొడుకు అక్కడ లేకపోయాడే అని పెద్దభార్యకు మనస్సు చివుక్కుమనదా? ఏదో ఇందులో మాయ ఉండివుంటుందని ఆమె బుద్ధికి వెంటనే, స్ఫురించింది. తన కొడుకు పరిస్థితిని గురించి దివ్యదృష్టితో చూడసాగింది.

ఆరోజున పసివాడు, నీలిరోజాకోసం స్వర్గమంతా తిరిగాడు. ఎంత తిరిగినా దొరక్క పోవటంతో పాతాళానికి వెళ్ళాడు. అక్కడా దొరకలేదు. వరసన అన్ని లోకాలూ గాలించుకొంటూ పోయాడు. ఎక్కడా లభించిందికాదు. చివరకు, భూలోకమందు దొరకవచ్చునని అన్నారు కొందరు.

భూలోకానికి చేరుకుని, అక్కడ తోటలు, దొడ్లు, ఉద్యానవనాలు అన్నీ గాలించ సాగాడు. ఏరంగు రోజా అయినా దొరికింది కాని, వానికి నీలిరోజా మట్టుకు ఎక్కడా కనిపించలేదు. అయినప్పటికీ, పినతల్లి వ్రతం భగ్నమవుతుందనే బెంగతో, విసుగూ విరామమూ లేకుండా అలా వెతుకుతూనే వున్నాడు పిన్నవాడు.




పెద్దభార్య నిజానిజాలు తెలుసుకొని సవతిమీద మండిపడింది: "ఓసీ దుర్మార్గురాలా!—నా పసివానికీ నాకూ ఎడబాపులు చేసి, నీవు పెట్టిన బాధ ఇంతంత కాదు. నీకూ నీ బిడ్డలకూ అలానే ఎడబాపులై, దుఃఖప్రాప్తగాక! నా కొడుకును ఏ లోకానికైతే పంపివేశావో, ఆ భూలోకంతో నీకు సంబంధం ఏర్పడుతుంది. ఒకానొక రాజు నిన్ను పెళ్ళాడతాడు. నీ కొడుకే భూలోకమందు నీ కడుపున పుడతాడు. సృష్టిలో లేని నీలిరోజా నెపంతో మా తల్లీకొడుకులను యెలా అయితే విడదీశావో, కని విని ఎరుగని ఒక నెపంతో మీ తల్లీ కొడుకులకు







ఎడబాటు కలగబోతుంది. ఈ విధంగా నువ్వు దుఃఖించితీరవలసిందే!" అని శపించింది. తన బిడ్డను వెతికితెమ్మని తక్షణమే చెలికత్తెను భూలోకానికి పంపింది.

అక్క పెట్టిన శాపానికి తిరుగు లేదని తెలుసు చిన్నభార్యకు. వెంటనే సవతి కాళ్ళమీదపడి, క్షమిస్తేకాని విడువనన్నది. జాలిగుండెగల పెద్దభార్య హృదయంకరిగి, శాపవిముక్తికి మార్గం చెప్పి వెళ్ళిపోయింది.

అప్పుడు అక్కడికి వచ్చిన గంధర్వుడు సంగతులన్నీ గ్రహించాడు. 'జరిగిందానికి విచారించి లాభంలేదు. కాని, అవసరమైనప్పుడల్లా నేను నిన్ను కనిపెడుతూనే వుంటానులే!' అంటూ అనేకవిధాల చిన్నభార్యను ఓదార్చాడు.

అంతలో శాపంపొందిన ఆ చిన్నభార్యకు స్వర్గలోకపు విషయాలన్నీ విస్మృతిలో పడిపోయినై. ఆమె అదృశ్యమయింది. ఆమె కుమారుడుకూడా తల్లిలాగానే విస్మృతిచెంది, అదృశ్యమయ్యాడు. స్వర్గలోకంలో అదృశ్యమైన ఆ గంధర్వకాంత మరొక స్త్రీరూపంతో భూలోకంలోని ఒక ఉద్యానవనం చేరుకున్నది.

అప్పుడు గంధర్వుడు తన కంఠహారం నుండి పది ముత్యాలు తీసి, ఆ పది ముత్యాలనూ పదిమంది పరిచారికలుగా మార్చి, గంధర్వకాంత చేరుకొన్న ఆ ఉద్యానవనానికి పంపాడు. వాళ్లద్వారా ఒక వీణకూడా ఇచ్చి పంపాడు.

గంధర్వకాంత చేరుకొన్న ఆ ఉద్యానవనం భల్లాణరాజ్యానికి అధిపతి అయిన ప్రమోదమహారాజుది.

ప్రమోదునికి పెళ్లి అంటే ఎంతమాత్రం యిష్టం లేకపోయింది. ఆ రాజ్యంలో ముఖ్యులు నావద్దకు వచ్చి గత్యంతరం చెప్పమన్నారు. వారికి నేనొక మంత్రఫలం ఇచ్చాను. అది పట్టుకువెళ్ళి, రాజుకు





తెలియకుండానే ఫలాహారంలో పెట్టిప్వగా దానిని రాజు ఆరగించాడు.

రాజు ఆ ఫలాన్ని ఆరగించటమూ గంధర్వకాంత ఉద్యానం చేరుకోవటమూ, సరిగా ఒకేరోజున జరిగింది. ఆనాటి రాత్రి రాజు నిద్రిస్తూవుండగా గంధర్వకాంత పాడిన వీణపాట వీనులవిందుగా వినిపించింది. ఉన్నవాడున్నట్టు లేచి, ప్రమోదుడు ఆ ఉద్యానానికి చేరుకొన్నాడు. ఆమె అతిలోకసౌందర్యానికి ముగ్ధుడై, పాట విని తన్మయుడై, ఇంతవరకు పెళ్ళాడనని భీష్మించిన రాజు ఆ గంధర్వకాంతను పెళ్లాడాడు.

తీరా వివాహం జరిగిన తరువాత, మంత్ర ఫలాన్నిగురించిన రహస్యం ప్రమోదునికి తెలియవచ్చింది. ఇంకిప్పుడు తెలిస్తేమట్టుకేమి? గంధర్వకాంతను రాజు మనసారా ప్రేమించే పెళ్ళిచేసుకొన్నాడు! అందుకని, తన ప్రజలు చేసిన ఈ పనికి ప్రమోదుడు సంతోషమే వెల్లడించాడు," అని చెప్పాడు.

తరువాత—గంధర్వకాంతకు మహిపాలుడు పుట్టటం, రాజు మందాకినిని వలచి పెళ్ళాడటం, ఆమెకు అర్ధకమ్ముడు కలగటం, అప్పుడు మందాకిని మనసు మారిపోయి, తల్లియెదటనే మహిపాలుణ్ణి



అవమానపరుస్తూవుండటం — వరకు చెప్పి, మిత్రానందుడు మళ్ళి ప్రారంభించాడు.

"తన కొడుకును తన కళ్ళయెదట మందాకిని పెట్టే బాధలు సహించలేకపోయింది. గంధర్వకాంత, చెలికత్తెలతో ఆలోచించింది.

'నేను ఎదుట వున్నట్టయితే నా బిడ్డడిని సవతి ఇంకా యాతనలు పెడుతుంది. నేను లేకపోతే? ఒకవేళ తన కొడుకునకే పట్టంకట్టాలని దుర్బుద్ధిపుట్టి, కుట్రయేమైనా చేస్తుందేమో!—ఐనా, నేను తొలగివుండి, ఒక మూలనుంచి ఆమె చర్యలు కనిపెట్టుతూనే వుంటా' అన్నది.







ఈ నిశ్చయంతో గంధర్వకాంత, కన్న బిడ్డను ఎడబాసి ఒకానొక నిర్జన ప్రదేశం చేరుకున్నది. ఆమె నిర్జనప్రదేశ మనుకొన్న ఆ రహస్యస్థలంలో, తనకూ చెలికత్తెలకు ఆగత్యమైన సదుపాయాలు అన్నీ అమరి పోయివున్నాయి!! ఈ చక్కటి ఏర్పాటులు ఎలా జరిగినవో తెలియకుండానే, వారు అక్కడ కాలక్షేపం చేస్తూవచ్చారు.

ఇలా ఉంటూవుండగా-తనకొడుకునుగద్దె ఎక్కించువామనే ఆశతో సవతి మందాకిని తండ్రి ఐన కిరాతరాజుతోనూ, పురోహితు డైన రాజగురుతోనూ కుట్రలు పన్నింది. నాలుగేండ్లాయె దేశంలో పట్టిన కాటకం సాకుగా పెట్టి, మందాకిని సవతికొడుకును బలిపెట్టబోయింది.

ఇదంతా కనిపెడుతూవున్న గంధర్వుడు ఒక వృద్ధుని రూపంలో నిర్జనప్రదేశానికి ఎగిరివచ్చి గంధర్వకాంతకు ఈ విపత్తును గురించి చెప్పాడు. చెప్పడమే కాదు. ఆమె ఒక రాజహంసగా మారిపోగల శక్తినిచ్చి, ఆమెతోవున్న పదిమంది చెలికత్తెలనూ తిరుగా పది ముత్యాలుగా మార్చివేసి, కంఠహారంలో చేర్చి ధరించుకున్నాడు!!

ఆటుతరువాత—

సరీగా సమయానికి, హంసరూపంలో వున్న గంధర్వకాంత తన కొడుకును ఎగరేసుకుపోవటం, కోటలో మందాకిని విషంపుచ్చుకు మరణించటం, ప్రమోదుడు రాజగురును పట్టి కట్టడం, అతను మంద పాలునితో చేరటం, కుట్రలోనించి తప్పు కొన్న కిరాతరాజు మనవడైన అర్ధకర్ముణ్ణి పెంచి పెద్దవానిగా చేయటం. వానికి పెళ్ళి కావటం, ఆ అర్ధకర్మునికి 'చిత్రభాను'వనే కొడుకు పుట్టటం..."—ఇంకా యేమో చెప్పబోతూవుండగా పసివాడు అడ్డుపడి,

"ఏమిటీ! చిత్రభానుడా!!" అని ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.





అందుకు మిత్రానందుడు, "అవును నాయనా, అవును. నీవే ఆ చిత్రభానుడివి. ఈ భల్లాణరాజ్యం నీవే. ఇలా అంటే నీకు ఆశ్చర్యముగా వుందేమో. నీవు తలయెత్తుకోకుండా ద్రోహంచేస్తున్నవాడు ఆ పరమ దుర్మార్గుడు రాజగురే!" అంటూ, అంత వరకు జరిగిన చరిత్రఅంతా విప్పిచెప్పాడు.

తరువాత—

"నాయనా, చిత్రభానూ!—అనాడు హంసపై ఎక్కి కూర్చున్న మహీపాలుణ్ణి తల్లి ఎగరేసుకు పోతూవుంటే, వానికి అంతా అగమ్యమనిపించింది. అయితే, 'బలిపీఠం నుండి బయటపడ్డానుకదా, నా తల్లిని నేను చేరుకోగలిగానుకదా!' అని ధైర్యంచెందాడు.



ఆ బంగారుహంస అలా ఆకాశమార్గాన ఎగిరి, నదులూ కొండలూ దాటుకొనిపోయి, ఒకానొక ద్వీపంలో ఆగింది. దానిపేరే మంజూల ద్వీపం. ఆ ద్వీపాన్ని పరిపాలించే రాజు తపోవర్ధనుడు.

రత్నకిరీటధారి ఐన ఒక రాజకుమారుడు బంగారు హంసపై వచ్చి తన ద్వీపంలో దిగిన వార్త క్షణంలో తెలిసింది ఆ రాజుకు.

తెలియగానే తపోవర్ధనుడు ఆశ్చర్యపడ్డాడు. ఇది వరప్రసాదమే అని పొంగి పోయాడు. పావదారిగానే ఆత్రంతో వెళ్లి, ఆ తావుకు చేరుకొన్నాడు.

రాజును చూడగానే, హంసరూపంలో వున్న గంధర్వకాంత తననుగురించి, కొడుకునుగురించి పూర్తిగా చెప్పింది. మానవ భాషలో మాట్లాడిన ఆ హంసను చూచి చకితుడైనాడు తపోవర్ధనుడు. 'రాజా!—పసివాడిని నీకు వప్పగిస్తున్నా. నీదే భారం!!' అంటూ హంస ఆకాశంలోకి ఎగిరిపోయి, శాపవిముక్తి చెంది, గంధర్వలోకానికి చేరుకుంది.

దైవికంగా తనకు లభించిన పసివాణ్ణి, తపోవర్ధనుడు మక్కువగా చూచుకొంటూ,





సమస్త విద్యలలోనూ వానిని ప్రవీణుడుగా చేశాడు. తన ఒక్కగా నొక్క కుమార్తెను ఇచ్చి వైభవంగా వివాహం చేశాడు.

ఐతే, విధివిలాసమేమోకాని, మహీపాలునికి ఆట్టేకాలం సంతోషం లేకపోయింది.

ఇప్పుడు రత్నకిరీటం మంజులద్వీపంలో చిక్కుకొన్నట్టు చారులద్వారా పొరుగు ద్వీపాల రాజులందరకూ వెల్లడైంది. అందులో ఒకరాజు, కిరీటాన్ని కాజేయాలనే ఆశతో తపోవర్ధనుడిపైకి దండెత్తుదామనుకున్నాడు. ఈ వార్త తెలియగానే, మహీపాలుని మనస్సు పరిపరివిధాల పోయింది.

"నాకు గండం తప్పించటానికని మా తల్లి నన్ను ఇక్కడ చేర్పింది. ఈ ద్వీపాన్ని ఏలే తపోవర్ధన మహారాజు చేతులలో నన్ను పెట్టింది. అలా పప్పగింత పెట్టినందుకు, మహారాజు నన్నెంతగానో ఆదరించాడు. అయినా, నాకదేమో మనశ్శాంతి లేకుండా పోతున్నది. ఎంత యోచించినా కారణం తెలియటంలేదు. వృద్ధుడైన నా తండ్రి భల్లాణ రాజ్యంలో ఎలా వున్నాడో? అంతర్థానమైన నా తల్లి యేమయిందో? మధ్యని ఈ కిరీటం నా చేతులలో చిక్కుకునిపోయిందే? తీరా యిప్పుడు పొరుగు రాజుల దృష్టి దీనిమీద పడిందాయె! ఇందుకోసం యుద్ధానికికూడా వస్తారని తెలుస్తున్నది. నిజంగా యుద్ధమే జరిగితే జయాపజయాలు ఎవరు నిర్ణయించగలరు? కాని. నా మాట ఏమైనప్పటికీ, ఈ రత్న కిరీటాన్ని పిట్టైనంత గుట్టుగా భద్రపరచటం నావిధి. ఇప్పుడున్న పరిస్థితులలో నే చేయగల పని ఇదే" అని నిశ్చయించుకొన్నాడు.

ఈ నిశ్చయంతో మహీపాలుడు ఒక దుర్గమారణ్యం ప్రవేశించాడు. నరుడి కంటబడని చోటున, ఒక చెట్టుమీద కొమ్మల సందున, అతిభద్రంగా రత్న కిరీటాన్ని దాచిపెట్టాడు.

అంతలో— (ఇంకా వుంది)








6

"అంతలో— మహీపాలుడు సరిగా అనుకొన్నట్టుగానే, పారుగుద్వీపపు రాజు వసుపాలుడు, మంజులద్వీపంమీదికి దండెత్తివచ్చాడు. ఉభయపక్షాల మధ్యనీ తీవ్రమైన యుద్ధంజరిగింది. ఆ యుద్ధంలో తపోవర్ధనుడూ మహీపాలుడూకూడా మరణించారు! ఈ వార్త వినగానే మహీపాలుని భార్యకూడా ప్రాణంవిడిచింది!!

ఆటుతరువాత వసుపాలుడు మంజులద్వీపాన్ని ఆక్రమించుకొని, రత్నకిరీటం కోసం అంతటా వెతికాడు. కనిపించలేదు. వెంటనే భటులను నలుమూలలకూ పంపి వెతికించాడు. ఫలితం లేకపోయింది.

ఇలా ఉండగా-ఒకరోజున రాజు వేటకు వెళ్ళినప్పుడు ఆ అడవులలో చెట్టుపైన కొమ్మలనందున, ధగధగ మెరిసే రత్నకిరీటం చూడటం తటస్థించింది. కాని, యేమీ చేయలేకపోయాడు. ఏమంటే—

ఆ చెట్టుమొదలును ఒకానొక భయంకర భూతసర్పం చుట్టుకొనివున్నది. ఆ సర్పానికి కన్నులు మినుకుమినుకుమంటున్నవి. కాళ్లకు పంజాలా పులిగోళ్ళు అమరివున్నాయి. చర్మమంతటా బలిష్ఠమైన డిప్పలున్నవి. మొసలిలాగా కనిపిస్తున్నది. అది నోరుతెరచి బుసలుకొడితే, అగ్నిజ్వాలలు ఎగసివస్తున్నాయి !!

వసుపాలుడు కోటకు మరలిపోయాడు. 'ఫలానాచోటున రత్నకిరీటమున్నది. ఎలా అయినా దానిని తీసుకరండి' అని భటులకు ఆజ్ఞాపించాడు. భటులందరూ








పోయి, ప్రయత్నించి, విఫలులయ్యారు. అప్పుడు, రాజు 'ఆ భూత సర్పాన్ని చంపి, ఎవరైతే రత్నకిరీటాన్ని తెస్తారో, వాళ్ళకు కోరుకొన్న బహుమతి యిస్తా'మని దండోరా వేయించాడు. ఈ చాటింపు విన్న ప్రతివాళ్లకూ ఆశ కలిగింది. కాని, వెళ్ళి యత్నించినవాళ్ళందరూ భూతసర్పం వెలి గ్రక్కే మంటలకు ఆహుతి ఐపోసాగారు!

చివరకు రాజు విసుగుచెందాడు. పేరు పొందిన జ్యోతిష్కులను రప్పించి, 'కిరీటం పొందేమార్గం ఏమిటి?' అని ప్రశ్నించాడు.

వాళ్ళు చక్రాలువేసి, అంకెలు గుణించి 'మహరాజా!—ఏనాటికైనా రత్నకిరీటం వారి వంశస్థులకే చిక్కుతుందిగాని, ఇత రులు యత్నించి లాభమే లేదు' అని చెప్పారు. ఎవరైనా వస్తారేమో అని వసు పాలుడు అలానే కనిపెట్టుకొని వున్నాడు. ఆ మహిపాలుడే మీ పెద్దనాయన. అతనే ఆత్మకు శాంతి కలిగించమని కలలో బతి మాలుత" అని చెప్పాడు మిత్రానందుడు.

తరువాత మళ్ళీ—"కుమారా, చిత్ర భానూ!—ఆ రత్నకిరీటం సంపాదించి తీసుకరావటంతో మీ పెదనాయనకు ఆత్మ శాంతి కలుగుతుంది, కుటుంబ గౌరవమూ నిలబడుతుంది. మీ తాత అమరభూపతి నీకోసం బెంగపెట్టుకుని వున్నారు. ముందు అక్కడికి పోయి, అతని దీవన పొంది మరీ బయల్దేరు. నీకు మేలవుతుంది" అంటూ హితవు చెప్పాడు.

చిత్రభానుడు మగధరాజ్యానికి బయలు దేరాడు.

• • •

ఆనాడు మందపాలుడు ప్రమోదుణ్ణి అగ్ని ప్రమాదంనుండి కాపాడి, తరువాత అర్ధ కర్ముని భార్యనుకూడా రక్షించటానికిగాను తిరుగా అతను కారాగారానికి వెళ్ళినట్టు చెప్పవున్నాము కదా?









ఆ సమయంలో ముసలి రాజు ప్రమోదుడు, తనను ఎవ్వరూ గమనించలేని మోస్తరుగా నటిస్తూ, అక్కడినుండి మెల్లగా జారుకోసాగాడు. ఆ సందట్లో ఎవరూ ఆతనిని గమనించలేదు. రాజ్యంలోని ప్రజలే అతనిని గుర్తుపట్టలేనప్పుడు రాజగురు నియమించిన భటులా గుర్తించేది?

కారాగృహంనుండి బయటపడిన ప్రమోదుడు అన్నాహారాలు మాని, కాళ్ళు ఎక్కడకు తీసుకపోతే అక్కడికి పోసాగాడు.

ఒకచోట అమరభూపతి చారులు తారసపడి, ప్రమోదుణ్ణి గుర్తుపట్టి, తమ ప్రభువు వద్దకు తీసుకపోయారు. వియ్యంకుడు కంటబడటంతో అమరభూపతి పరమానందం పొందాడు.

అంతలో చిత్రభానుడు మగధ చేరుకొన్నాడు. పిన్నవానిని చూస్తూనే తాతలిద్దరూ పొందిన ఆనందానికి మేరలేకపోయింది. పసివాడు తలపెట్టిన మహత్కార్యానికి ఎంతగానో మెచ్చుకొని వారు మరీ సంతోషించారు.

ఐతే, బిడ్డడు ఒక్కడూ పోవడం తాతలకు మనస్కరించిందికాదు. అప్పుడు అమరభూపతి తన కుమారుడు విజయభూపతిని తెచ్చి, ఇద్దరినీ దీవించి, మంచిరోజున మంజులద్వీపానికి ప్రయాణంకట్టాడు.

• • •

అక్కడ, కారాగృహంవద్ద—ఏమి జరిగిందంటే—

సొలిపోయిన రాజగురు తేరుకొన్నాడు. ఐతే, ప్రమాదం ఎలా సంభవించిందీ అర్థం కానేలేదు. ఇంత జరిగినా దుష్టచింతలను మానలేదు. తన పాచిక పారలేదుకదా అని విచారించి ముసలిరాజును రక్షించినందుకు మందపాలునిపైన పగపట్టాడు.

ఇంతకూ ప్రమోదుడు కనబడకపోగా కలవరపడ్డాడు. చివరకు 'పోనీ, ముసలి








వాడు యెక్కడ చస్తే మనకేం!' అని తలిచి, ఉపేక్ష వహించాడు.

ఒకనాటి రాత్రి రాజగురు, మందపాలుడు యేమరివుండగా బాకుతో చంపి, ఆ నేరం నిరపరాధి ఐన ఒక అమాయకుని పైన మోపి, వాడికి ఉరిశిక్ష వేయించాడు.

రాజగురు మాయచేసి ముసలిరాజునూ, మందపాలుణ్ణీ చంపివేసి ఉంటాడని ప్రజలు ఊహించారు. పైగా, కప్పంకోసం రాజగురుచేసే నిర్బంధంతట్టుకోలేక సామంతులు మళ్లీ అమరభూపతిని ఆశ్రయించారు. ఇప్పుడు అమరభూపతికి వృద్ధరాజయిన ప్రమోదుని సలహాయే!

దూరం యోచించాడు ప్రమోదుడు. ఇప్పుడు భల్లాణకోటను ముట్టడించటమే పని అన్నాడు.

సామంతులందరూ యేకమై రాత్రికి రాత్రి భల్లాణకోటను ముట్టడించారు. అన్ని బలాలూ ఉడిగిపోయిన రాజగురు కలత చెందాడు. రహస్య సొరంగంద్వారా తప్పించుకుపోదామని చూచాడు. రెండడుగులు వేశాడో లేదో, అమరభూపతి సేవకులు పట్టివేశారు. తెల్లబోయాడు రాజగురు! రహస్యద్వారాలకు ప్రమోదుడు కాపలా పెట్టించిన సంగతి వానికేం తెలుసు?

కోట ప్రమోదుడి వశమైంది. సామంతులు సంతోషించారు. ప్రజలు పరమానందం పొందారు. భల్లాణరాజ్యం మరొకసారి పూర్వపు కళతో కలకలలాడింది! అందరూ పసివాళ్లకోసం యెదురుచూడసాగారు.

• • •

చిత్రభానూ విజయభూపతీ కలిసి అష్టకష్టాలూ పడి, చివరకు మంజులద్వీపం చేరుకున్నారు. పసుపాలుడు వాళ్ళిద్దరినీ ఎంతగానో ఆదరించి, గౌరవించాడు. 'మీకోసమే ఎదురుచూస్తున్నా'నన్నాడు.





'ఈనాటికి మళ్ళీ రత్నకిరీటం భల్లాణ రాజ్యం చేరుకోబోతుందంటే నాకు అపరిమితమైన సంతోషంగా ఉన్న'దన్నాడు.

అందరూ అరణ్యం చేరుకొన్నారు. చెట్టుకు చుట్టుకొనివున్న భూతసర్పాన్ని గురించి వసుపాలుడు, చిత్రభానుణ్ణి హెచ్చరించాడు. కిరీటం తేవాలనే ఆత్రంతో చిత్రభానుడు సాహసించి చెట్టువద్దకు వెళ్ళాడు.

భయంతో, ఆశ్చర్యంతో అందరూ చూస్తున్నారు. చర్రున ఖడ్గం దూశాడు చిత్రభానుడు. సర్పాన్ని ఒక్కవేటు వేయబోయాడు.

చిత్రమేమిటోకాని, ఖడ్గం తగిలీతగలటంతో ఆ భయంకర సర్పం ఒకచక్కటి గంధర్వుడుగా మారిపోయింది!

అప్పు డా గంధర్వుడు, చెట్టుపైనున్న రత్నకిరీటం తెచ్చి, చిత్రభానుని చేతులలో పెట్టాడు.



"నాయనా! నాకు శాపవిముక్తి కలిగించావు—ఇన్నాళ్ళుగా ఇందుకోసమే నేను అందరికీ కలలో కనబడి నా ఆత్మకు కాంతి కలిగించమన్నాను. ఈ పని ఎవళ్ళూ నెరవేర్చలేకపోయారు. ఎప్పటికైనా నీవే ఈ పనికి తగినవాడవనే నమ్మకంతో ఉంటూవద్నాను నేను. యుద్ధంలో ప్రాణం పోయినా, ఈ భూతసర్పంగా ఆకారం దాల్చాను. వంశమర్యాదను నిలబెట్టి, ఆత్మకు కాంతికలిగించిన నీకు కిరీటం వప్పగించివేశాను. ఇక నాకేమీ చింతలేదు" అని చెప్పి, ఆ గంధర్వరూపంలోవున్న మహిపాలుడు అదృశ్యమయ్యాడు.

ఇదంతా చూస్తూవున్న వసుపాలునికి అపరిమితమైన ఆశ్చర్యం కలిగింది. అంతే కాదు, కిరీటాన్ని యెలాగైనా కాజేయాలనే తహతహ ఎక్కువైంది. తన వుద్దేశాన్ని భార్యతో చెప్పాడు. ఆ మాటలు అతని కూతురు జయంతికూడా విన్నది.







ఎట్లాఅయినా వాళ్ళిద్దరినీ కాపాడడానికి నిశ్చయించి, ఆమె తన చెలికత్తె సహాయంతో సగంరాత్రివేళప్పుడు మూడు గుర్రాల్ని కోటవాకిట సిద్ధంచేయించింది. మాటుమణిగిన తరవాత, పసివాళ్లిద్దరూ ఉండే గదిలోకి వెళ్ళి, వెంటరమ్మని వాళ్లను వేగిరపెట్టింది. వాళ్ళు సంశయించటంచూచి, జయంతి—

"నామాట వినండి. నాతండ్రి మిమ్మల్ని చంపేందుకు వస్తున్నారు. అమ్మతో చెబుతూవుంటే చెవులారా విన్నాను. రత్నకిరీటం కోసమని ఈ ద్వీపంమీద దండెత్తిన మా నాయన, చేతులారా మీకు దానిని అప్పగించి ఊరకుంటాడా? మీరు ఈ కోటలో ప్రవేశించినప్పుడే మేడమీదనుండి నేను మిమ్మల్ని చూశాను. చూచినప్పటినించీ మీకు ఏ అపాయమూ కలగకుండా చేయుమని దేవుళ్లకు మొక్కుతునేవున్నాను. నాతండ్రి ఎంత దురాశాపరుడూ కాకుంటే నన్నొక శతవృద్ధుకిచ్చి పెళ్ళిచేయ నిశ్చయిస్తాడా? నాకు తల్లి ఉండి ఒకటే, లేకా ఒకటే. ఆమెకు మా నాయన కంటె ధనాశ హెచ్చు. అందుకని ఏమన్నా చేస్తుంది. నన్ను ఈ ఆపదనుండి తప్పించండి. తీసుకపోండి. ముగ్గురమూ పారిపోదాం. ఏర్పాట్లు చేసేవచ్చా" అన్నది.

ఆ నడిరాత్రప్పుడే పసుపాలుడు, అనుకొన్నప్రకారం వాళ్లను చంపటానికని బయల్దేరాడు. అంతలో ఒక సేవకుడు పరుగెత్తుకొంటూవచ్చి, 'ప్రభూ!—అమ్మాయిగారు అంతఃపురంలో లేరు. ఈ సంగతి మనవిచేదామని వస్తే యేలిక దర్శనం కాలేదు. అందుకని వెదుక్కొంటూ యిక్కడికి వచ్చాను' అని చెప్పాడు.

ఈ మాట వింటూనే రాజు, తనువచ్చిన పని మరచి, వానితో అంతఃపురానికివెళ్లాడు.

ఆదేసమయాన- ఆ గదినుండి ముగ్గురూ రత్నకిరీటంతో సహా యివతలకు వచ్చి,








సిద్ధంగా వున్న మూడు గుర్రాలపైన ఎక్కారు. మేడమీద రాజు వీళ్లను చూచాడు.

వాళ్ల కుట్రను వెంటనే పసికట్టి ఒడిలో కత్తిని చర్రున విసిరాడు! దురదృష్ట వశాత్తు అది చిత్రభానుని వీపులోపలికి దూసుకపోయింది!! చిత్రభానుడు దానిని గభీమని లాగివేశాడు.

కోటపైనుంచి వసుపాలుడు 'పట్టండి! పట్టండి!!' అని కేకలు వెయ్యసాగాడు. వెంటనే అశ్వికులు బయలుదేరారు. కాని, వాళ్ళను పట్టటం సాధ్యంకాలేదు.

వాళ్ళు, తీరం చేరుకుని, పడవకు లంగరు విప్పి, క్షణంలో సాగిపోయారు! తరుముకువచ్చిన అశ్వికులు చేసేదిలేక, వాళ్లు వెళ్లిపోతూవుంటే నిల్చుని ఓడవైపు చూస్తూవున్నారు.

ఓడలో ఎక్కగానే, జయంతీ విజయ భూపతీ కలిసి చిత్రభానుడికి సమస్తమైన ఉపచారాలూ చేశారు. ఎంతచేసినా, విసరిన కత్తి విషపూరితమైనది కావటంచేత, దానివని అది చేస్తూనేవుంది. అయినా చిత్రభానుడు ధైర్యం వదలలేదు; తన బాధ పైకి తెలియనీయలేదు.

అక్కడ భల్లాణరాజ్యంలో—

ఓడ దిగిందని వినగానే అశేషజనమూ, ఉప్పొంగిపోయారు. చిత్రభానుడు రత్నకిరీటాన్ని తాతచేతులలో పెట్టాడు! ప్రమోదుడు చెప్పరాని ఆనందం పొందాడు. పసివాని పట్టాభిషేకానికి వెంటనే యేర్పాట్లు చేయించమన్నాడు అమరభూపతితో.

ఐతే - అంతలోనే పసివాడికి ముంచుకు వచ్చింది! వెంటనే రాజు మిత్రానందుని వద్దకు మనిషిని పంపాడు. కాని, యజ్ఞ యాగాదులు ముగించుకొని అతను ఎప్పుడో వెళ్ళిపోయాడు!

చిత్రభానుని పట్టాభిషేక ముహూర్తం సమీపించింది. కాని పసివాడు మంచంమీద

పడుకొనే వున్నాడు. చుట్టూ అందరూ చేరారు. చిత్రభానుడు అందరనూ కడసారి చూశాడు. జయంతచేతినీ, విజయభూపతి చేతినీ కలిపి, జలజల బాష్పాలు రాలుస్తూ, కనుమూశాడు !! అతను అస్తమించటంతో భల్లాణరాజ్యమే దుఃఖసాగరంలో మునిగిపోయింది !!!

వృద్ధరాజు ప్రమోదునికి హృదయంలో చిచ్చుపెట్టినట్టయింది. ఆయన కన్నుల నుండి వలవల రాలే బాష్పధారలకు తెరపి లేకపోయింది.

మరుక్షణంలోనే కన్నులు చింతనిప్పుల లాగా ఎర్రబడినై. ఎక్కడలేని కోపం రత్నకిరీటంమీద వచ్చిపడింది. గబగబ రత్నకిరీటంవుండే గదిలోకి వెళ్ళి, దానిని తీసి, బలంకొద్దీ నేలకువేసి కొట్టాడు. దెబ్బతో కిరీటం ముక్కముక్కలైపోయింది. కాంతులు విరజిమ్మే రత్నాలన్నీ రవ్వలై, మిణుగురు పురుగులలాగా మెరుస్తూ, చెదిరిపోసాగినై.

"నా వంశాన్ని నిర్మూలంచేసిన యీ రత్నకిరీటం ఉండేమి, లేకేమి!—హయ్యో! నా చిన్నారి చిత్రభానుడు సింహాసనంమీద కూర్చుండగా, ఈ కిరీటం ధరించివుండగా చూచేభాగ్యం లేకపోయిందికదా! వాడి పట్టాభిషేకం కలగానేనట్టు ఐపోయిందే!! నా ఆశలన్నీ అడుగంటిపోయినయే!!! ఇంకా నేను బతికి ఎందుకు వున్నట్టు?" అంటూ అనేకవిధాల వాపోయాడు.

మరుక్షణంలో మళ్ళీ ఉగ్రుడయ్యాడు. ఒడలు వణికిపోసాగింది. కాళ్ళు తడబడినై. ఆవేశం పట్టలేక, బట్టలు చింపుకొన్నాడు. జుత్తు పీకుకొన్నాడు. పిచ్చివాని లాగా అటుయిటు అడుగులు వేస్తూ "ఏడీ, నన్నూ నా కుటుంబాన్నీ నాశనంచేసిన ఆ దుర్మార్గుడు ఏడీ? రాజగురు డేడీ!!—" అంటూ ఉరుములు వురిమాడు.

రాజు కాళ్లు రత్నాల రవ్వలమీద పడగా, జర్రున జారిపోయాడు. మరి లేవలేదు!!!



